# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక, ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

# మెట్రిక్ పద్ధతిలో ఆలోచించండి

మీటర్లలో అడగండి

గజములలో కాదు.



మెట్రిక్ పద్ధతిలో ఆలోచించక, గజములు అడుగులలోకి మార్చుకొంటూ వుంటే, భ్రమకు లోనవుతారు. ఇప్పుడు దేశమంతటా మెట్రిక్ పద్ధతే, తూకములు కొలమానములకు న్యాయబద్ధమైనదిగా ఉపయోగింపబడుతోంది. వ్యాపారులందరూ ప్రభుత్వమువారిచే ముద్రింపబడిన తూకములను, కొలమానములను ఉంచుకొనవలెను. వీటిని సరిగా ఉన్నవీ లేనివీ పరీక్ష చేసేందుకు ఎప్పుడైనా ఆఫీసర్లు రాగలరు.

**మెట్రిక్ పద్ధతిలో ఆలోచించి మీకూ దేశానికీ సహాయపడండి.**

**మెట్రిక్ తూకములు, కొలమానములు మాత్రమే యిప్పుడు న్యాయబద్ధమైనవి**

DA-65/616

అదనపు
తెలుపుదనము
ఎక్కడ నుంచి
వస్తుంది?




# టినోపాల్‌తో అన్నింటికంటె హెచ్చు తెల్లదనం వస్తుంది

ఆఖరిసారి బట్టలు జాడించడానికి ముందు కాస్త టినోపాల్ వేయండి-మరిచూడండి. మీ తెల్ల బట్టలన్నీ మిరుమిట్లు గొలిపేలా మెరుస్తాయి. షర్టులు, చీరెలు, తువ్వాళ్లు, దుప్పట్లు—ప్రతీదీ అదనపు తెల్లదనం పొందుతుంది.

ఈ అదనపు తెల్లదనం మూలంగా మీకు ఖర్చు ఎంతో? ఒక బట్టకు ఒక పైసా కూడా కాదు. ఒక బాల్చీడు బట్టలను తెలుపు చేయడానికి ఒక పావు చిన్న చెమ్చాడు చాలు.

శాస్త్రీయంగా తయారుచేసిన లైనర్ టినోపాల్‌నే సర్వదా ఉపయోగించండి. ఇది బట్టలకు ఏ విధంగానూ చెరపు (హాని) చేయదు.



ఇప్పుడు సీలుచేసిన అల్యూమినియం ఫాయిల్ పేకెట్‌లో కూడా దొరుకుతుంది.

ఒక పేకెట్‌తో ఒక బాల్చీడు బట్టలు తెలుపు అవుతాయి. ఉపయోగించడం సులభం—ఎటువంటి వృధా లేదు. ఒక బాల్చీకు ఒక పేకెట్ చాలు.




టినోపాల్, జె. ఆర్. గైగి ఎన్, ఎ., బాల్, స్విట్జర్‌లండ్ వారి రిజిస్టర్డు ట్రేడ్ మార్కు. సుహృద్ గైగి లి. పి. ఒ. బాక్సు 965, బొంబాయి-1. బి. ఆర్.

Shilpi SG 223 A Tel

అన్నివంటలకు శ్రేష్ఠమైన
## నూనెలు




అగ్‌మార్కు కాబడిన
ఏ.యస్.బ్రాండ్..
## చాయపప్పు నూనె




అగ్‌మార్కు కాబడిన
మేన్షన్ బ్రాండ్......
## నువ్వులనూనె

- గోదావరిడెల్టా నువ్వులనుండి ఆరోగ్యకరమగుప్రత్యేకపద్ధతులతో తయారుకాబడినవి.
- రుచి,రంగు,సువాసనలతో అన్నివంటపదార్థములను అమితముగరుచికరముగ చేయును.
- ఊరగాయలను చాలకాలము నిలువయుంచును. ముక్కను మెత్తబడనీయదు,బూజుపట్టనీయదు.
- తలకు వాడినయెడల మెదడుకు చలువ చేయును. వెంట్రుకలను బాగుగా పెరుగునట్లు చేయును.
- 16,4,2. కి.గ్రా.డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.

డిస్ట్రిబ్యూటర్సు :

శ్రీ మాజేటి వీరరాఘవయ్యా
విజయవాడ
ఫోన్ నెం. 567

శ్రీ బచ్చు రామకృష్ణయ్యా
చీదెల్ల పెద్దనాగయ్యా
శ్రీ పోలా పెద్దవెంకయ్యా చెట్టి & సన్సు
తిమ్మనచర్ల

MFRS, అంబటి సుబ్బన్న & కో. సామర్లకోట

## మైకో-అంబాళ్ అగర్‌బత్తి

## మైకో-రజనీకాంత్‌బత్తి

మానవుల కోరికలు తీరవలెనంటే అంబాళ్ అనుగ్రహం కావాలి. అంబాళ్ అనుగ్రహం కోసం అంబాళ్ బత్తీలనే వాడాలి. మధుర మనోహర పరిమళము గల అగర్‌బత్తులు.




తయారుచేయువారు :
## విజయా కెమికల్స్
మదరాసు - 7

# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ సంచికతో "నవాబు నందిని" పూర్తి అవుతున్నది. దాని స్థానంలో, వచ్చే మాసం నుంచి, మరొక రంగుల బొమ్మల సీరియల్ ప్రారంభమవుతున్నది.

"[illegible]" [పరోపకారి పాపన్న కథ] లో ప్రజాద్రోహులు ఎలాటి దుండగాలకు సిద్ధపడతారో చక్కగా చూపబడింది. ఈ కథ ఈనాటిది కాదు, పెత్తందారీ జమానాలలో ఉన్న నాటిది. ఇలాటి పెత్తందారీలు వెనకబడిన కొద్దీ ప్రజల జీవితం ముందుకు పోతుందన్న నీతిని మనం ఈ కథలో చూడవచ్చు.

"కృతఘ్నురాలు" [బేతాళ కథ] లో కూడా ఒక నీతి ఉన్నది. దుర్బుద్ధులు శిక్షతో గాని మారరు. నిప్పు నుంచి తనను కాపాడిన నలుణ్ణి పాము కాటు వేసినట్టు, వారు ఉపకారులకు కూడా అపకారమే చేస్తారు.

సంపుటి : 38 - ఏప్రిల్ 1966 - సంచిక : 4



# భారత చరిత్ర



అఫ్జల్‌ఖాన్ మరణానంతరం శివాజీ దృష్టి దక్షిణకొంకణం మీదికీ, కోల్హాపూరు మండలం మీదికీ మళ్ళింది. అయితే 1660 జులైలో సాదీజౌహర్ నాయకత్వాన బిజాపూరు సేనలు, శివాజీ ఉండిన పనహాలా దుర్గాన్ని చుట్టుముట్టాయి. శివాజీ ఆ దుర్గాన్ని వదిలిపెట్టవలిసి వచ్చింది. త్వరలోనే అతనికి మరొక ప్రమాదం కూడా ఎదురయింది. దక్కనుకు కొత్తగా గవర్నరయిన షైస్తఖాన్, పూనాను ఆక్రమించి, చాకన్‌దుర్గాన్ని వశపరచుకుని, కల్యాణమండలం నుంచి మహారాష్ట్రులను తరిమేశాడు.

అయితే శివాజీ, మొగలుల సంగతి తేల్చుకునేటందుకు గాను, బిజాపూరుతో సంధి చేసుకున్నాడు. ఈ సందర్భంలో శివాజీకి అతని తండ్రి సహాయం లభించింది; ఆయన బిజాపూరులో ఇంకా ప్రముఖుడుగానే ఉన్నాడు. రెండేళ్ళపాటు శివాజీ బలాలకూ, మొగలు బలాలకూ చెదురు మదురుగా యుద్ధాలు జరిగాయి. 1663 ఏప్రిలు 15 నాటి రాత్రి శివాజీ కొంత మంది అనుచరులతో సహా రహస్యంగా, పూనాలోని షైస్తఖాన్ మందిరం ప్రవేశించి, చుట్టూ ఉన్న అంగరక్షకులనూ, ఆడబానిసలనూ తప్పుకుని, దక్కను గవర్నరు శయ్యాగారంలోకి వెళ్ళి, అతనిని గాయపరిచి, అతని కొడుకును చంపి, అలాగే ఒక సరదారునూ, నలభైమంది పరిచారకులనూ, ఆరుగురు అంతఃపుర స్త్రీలనూ హతమార్చి, నిరపాయంగా, సమీపంలో ఉన్న సింహగడదుర్గానికి వెళ్ళిపోయాడు. షైస్తఖాన్ చావలేదు గాని, అతని బొటనవేలు పోయింది.

ఈ సాహస చర్యతో శివాజీ కీర్తిప్రతిష్ఠలు పెరిగాయి. త్వరలోనే అతను ఇలాటి సాహసచర్య మరొకటి చేశాడు. 1664

జనవరి 16—20 తేదీల మధ్య అతను సూరత్ పైన పడి, దాన్ని కొల్లగొట్టాడు. పశ్చిమ తీరాన అంత భాగ్యవంతమైన రేవుపట్టణం మరేదీ లేదు.

శివాజీ చేసిన ఇలాటి చర్యలు దక్కనులో మొగలుల కీర్తికీ, పలుకుబడికీ గొడ్డలిపెట్టయాయి. అందుకని ఔరంగజేబు 1665 లో శివాజీని నిర్జించటానికి కొంత సైన్యాన్ని పంపాడు. అంబరు రాజైన జయసింగూ, దిలీర్‌ఖాన్ అనే వాడూ ఆ సైన్యానికి అధిపతులు.

జయసింగు రణవిద్యలోనూ, రాజనీతిలోనూ గట్టివాడు. అతను పురంధరదుర్గాన్ని ముట్టడించాడు. మొగలులు శివాజీ రాజధాని అయిన రాజగడదుర్గాన్ని కూడా ముట్టడించారు. మొగలులను ప్రతిఘటించడంలో గల కష్టనష్టాలను గ్రహించి, శివాజీ 1665 జూను 22 న జయసింగుతో పురందర వద్ద సంధి చేసుకుని, తన దుర్గాలలో ఇరవై మూడింటిని మొగలులకిచ్చి, తాను పన్నెండు మాత్రమే ఉంచుకున్నాడు. అతను మొగలులకు దక్కను యుద్ధాలలో సహాయంగా 5,000 అశ్వికసైనికులను తోడివ్వటానికి కూడా ఒప్పుకున్నాడు. తరవాత జయసింగు బిజాపూరు పైన యుద్ధం



చేసినప్పుడు ఆ యుద్ధంలో శివాజీ పాల్గొన్నాడు కూడా. జయసింగు శివాజీకి పెద్ద ఆశలు పెట్టి, ఆగ్రాలోని మొగలుదర్బారుకు వెళ్ళటానికి ఒప్పించాడు. శివాజీ తన కొడుకైన శంభూజీని వెంటబెట్టుకుని బయలుదేరి, 1666 మే 9న ఆగ్రా చేరాడు.

అయితే మొగలుదర్బారులో శివాజీకి పెద్ద పరాభవం జరిగింది. ఔరంగజేబు అతన్ని 5వేలకు సర్దారుగా మాత్రమే పరిగణించాడు. శివాజీ అవమానం భరించలేక అల్లరిచేసి మూర్ఛపోయాడు. ఒళ్ళు తెలిశాక అతను పాదుషాను నిందించాడు. పాదుషా అతన్ని నిర్బంధంలో పెట్టించాడు. మరొక



ఇటువంటి పరిస్థితిలో హతాశుడైపోను. కాని శివాజీ ఒక యుక్తి పన్నాడు. పథకం ప్రకారం తనకు వ్యాధి కుదిరినట్లు ప్రకటించి, అందుకు గాను రోజూ బ్రాహ్మణులకూ బుట్టలలో పళ్ళూ, మిఠాయీ ఖైదు నుంచి బయటికి పంపసాగాడు. కొద్దిరోజులు అయ్యాక కావలివాళ్ళు గంపలను తనిఖీ చెయ్యకుండానే బయటికి పోనిచ్చారు. శివాజీ, అతని కొడుకూ చెరొక గంపలో నక్కి కూర్చుని, మొగలు సేవకులవాళ్ళ కళ్ళలో దుమ్ము జల్లి తప్పించుకుపోయారు. తన కొడుకును మధురలో ఒక మహారాష్ట్ర బ్రాహ్మణ గృహంలో ఉంచి, శివాజీ బిచ్చగాడి వేషంలో అలహాబాదూ, కాశీ, గయా, తెలంగాణాల మీదుగా 1666 నవంబరు 30 న తన స్వస్థలానికి చేరుకున్నాడు. ఆ తరవాత మూడేళ్ళపాటు శివాజీ మొగలుల జోలికి వెళ్ళలేదు. ఈ కాలంలో ఔరంగజేబు అతనికి 'రాజా' అనే బిరుదూ, బీరారులో ఒక జాగీరూ ఇచ్చాడు. అయితే 1670 లో తిరిగి శివాజీకి మొగలులతో ఘర్షణ ఆరంభమయింది. శివాజీ తాను లోగడ మొగలులకు దత్తం చేసిన దుర్గాలను దాదాపు అన్నిటినీ తిరిగి గెలుచుకున్నాడు. 1670 అక్టోబరులో సూరత్ నగరాన్ని రెండోసారి కొల్లగొట్టాడు.

1674 జూను 16 న శివాజీ ఛత్రపతి అన్న బిరుదుతో రాయగడకు రాజుగా అత్యంత వైభవంతో పట్టాభిషేకం జరుపుకున్నాడు. అతను గోలకొండ సులాను మైత్రి సంపాదించి, ఒక్క సంవత్సరంలోనే జింజీ, వెల్లూరు, పరిసర ప్రాంతాలను జయించాడు (1677). శివాజీ కీర్తితో బాటు అతని రాజ్యం కూడా విస్తరించింది. అందులో 100 దుర్గాలుండేవి. అతని తార ఉచ్చలో ఉండగానే అతను తన 53 వ ఏట, 1680 ఏప్రిలు 14 న మరణించాడు.



# నెహ్రూ కథ

## 22



ప్రజల దృష్టి హెచ్చుగా స్వరాజిస్టుల మీదికీ రాష్ట్రశాసనసభల మీదికీ మళ్ళుతున్నది. శాసనసభలకు ఎన్నికైన వారు ఏమి చెయ్యదలిచినదీ తెలియరాలేదు. వారు బడ్జెటును తోసిపుచ్చారు. కాని వైస్రాయి సంతకంతో అది చట్టమయింది. అలాగే రాష్ట్రాలలో ప్రజల ప్రతినిధులు నిరాకరించిన బిల్లులు గవర్నర్ల సంతకాలతో చట్టాలయాయి. అంతటితో స్వరాజిస్టుల ఆట కట్టయినట్టయింది. ఇక ఏదన్నా జరగవలిసి ఉంటే అది శాసనసభలలో గాక బయటనే జరగాలి!

1924 మధ్యలో అహమ్మదాబాదులో కాంగ్రెసు కమిటీ మీటింగు జరిగింది. ఈ సమావేశంలో గాంధీజీకీ, స్వరాజిస్టులకూ మధ్య విభేదాలు తీవ్రమయాయి. మోతీలాలూ, దాసూ మొదలైనవాళ్ళు అనేక మందితోసహ బయటికి వెళ్ళిపోయారు. చాలామంది కాంగ్రెసు వాదులకు అహింసలో విశ్వాసం లేదని కూడా గాంధీజీ ఇప్పుడు తెలుసుకున్నాడు!

చిట్టచివరకు గాంధీజీ స్వరాజిస్టుల వైఖరికి సమాధానపడి, వారికి తన ఆశీర్వాదా లిచ్చి, తాను రాజకీయాల నుంచి విరమించుకుంటున్నానని చెప్పి, తప్పుకున్నాడు. ఆయన శకం అయిపోయిందన్నారు, ఆయన శక్తు లుడిగిపోయాయన్నారు, మోతీలాలూ దాసూ కలిసి గాంధీజీని వెనక్కు నెట్టేశారన్నారు. కాని ఇవన్నీ వట్టిమాటలు. ప్రజలలో గాంధీజీ పలుకుబడి ఏనాడూ తగలేదు, పైపెచ్చు నానాటికీ పెరిగింది.

స్వరాజిస్టుల ఉధృతమే క్రమంగా తగ్గుతూ వచ్చింది. మొదట్లో మోతీలాల్ శాసనసభా కార్యక్రమంలో చాలా ఉత్సాహంగా పనిచేశాడు, స్వరాజిస్టులకు ఇతర



పార్టీల సహకారం కూడా లభించింది. అయితే చిక్కులు కూడా ఏర్పడ్డాయి. కాంగ్రెసు బలం పెంచటానికి అడ్డమైన వాళ్ళనూ సభ్యులుగా చేర్చారు స్వరాజిస్టులు. ఇంతలో ఎన్నికలు వచ్చాయి. అందుకు డబ్బు కావాలి. ధనికులను ఖుషామతు చెయ్యవలిసి వచ్చింది. వారిలో కొందరిని స్వరాజిస్టు అభ్యర్థులుగా కూడా నిలబెట్టారు. ఇందువల్ల పార్టీలో అది నుంచీ పురుగు ప్రవేశించింది. క్రమంగా క్రమశిక్షణ సన్నగిల్లింది. ప్రభుత్వం స్వరాజిస్టులలోనే కొందరిని మచ్చిక చేసి చీలికలు కలిగించింది. కొందరు జారుకుని ప్రతిపక్షంలో జేర



బడ్డారు. మోతీలాల్ ఉగ్రుడయాడు. కాని ఏమీ చేయలేకపోయాడు.

1921–22 లో జవాహరుతో బాటు ఉద్యమంలో చేరి జైళ్ళకు వెళ్ళినవారు మంత్రులై, కాంగ్రెసు నాయకులను ప్రతిఘటించి, ఖైదులో పెట్టించే స్థితికి వచ్చారు.

1924 డిసెంబరులో బెల్గాంలో జరిగిన కాంగ్రెసు సమావేశానికి గాంధీజీ అధ్యక్షుడు. ఆయన చేసిన అధ్యక్షోపన్యాసం జవాహరుకు నచ్చలేదు, అది ఉత్తేజకరంగా లేదు. సమావేశం అయాక గాంధీజీ కోరికపై రాగల సంవత్సరానికి కాంగ్రెసు కమిటీ కార్యదర్శి పని జవాహరు పైన పడింది. తన కంతగా ఇష్టం లేకపోయినా జవాహరుకా పని తప్పలేదు.

1925 వేసవిలో మోతీలాలును ఉబ్బసం బాధించింది. ఆయన సకుటుంబంగా హిమాలయాలలోని డల్‌హౌసీకి వెళ్ళాడు. అక్కడ జవాహరు కూడా ఉండగా జూను మాసంలో. ఒకనాడు చిత్తరంజన్‌దాసు మరణవార్త టెలిగ్రాం ద్వారా తెలిసింది. మోతీలాల్ హతాశుడై పోయిన వాడల్లె గంటల తరబడి ఒక్క మాటైనా అనలేదు. ఆయన కుడిచెయ్యి పడిపోయింది. ఇంత కాలమూ ఇద్దరూ



పంచుకున్న భారమంతా ఇప్పుడు హిందూ లాలు పైన పడింది.

మత కలహాలు కాంగ్రెసు కొక తీరని సమస్యగా పరిణమించాయి. యావద్భారత స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగించటమే గాక, మతైక జీవనంలో ఏ మాత్రమూ విశ్వాసం లేని జవాహరు మతతత్వాన్నీ, దాని వల్ల దేశానికి రాజకీయంగా జరుగుతూండిన నష్టాన్నీ చక్కగా అవగాహన చేసుకోగలిగాడు.

హిందూ ముస్లిము వర్గాల మధ్య ఛిద్రాలు రావటానికి అనేక కారణాలున్నాయి. ముస్లిములు బక్రీదు పండగకు ఆవులను కోస్తే హిందువులు సహించలేరు. రోజుకు అయిదుసార్లు నమాజులు చేసే ముస్లిములు తమ ప్రార్థనల సమయంలో మసీదు బయట ఊరేగింపులు బాజాభజంత్రీలతో వెళితే సహించలేరు. మొహర్రం పండగనాడు హిందువుల పండగ ఏదైనా వస్తే తప్పక గలాటా జరుగుతుంది. చాంద్రమానం ప్రకారం వచ్చే మొహర్రం ఏ యేడు ఏ తేదీన వచ్చేదీ చెప్పటం కష్టం.

ఇలాటి కారణాల వల్ల హత్యలు జరగవలసినంత కారణ మేమీ లేదు. కాని అవతల బ్రిటిషువాళ్ళు విభజించి పాలించే



నీతిని పాటించి, మత కలహాలు ఎగదోసి, మతహత్యలకు బాగా దోహదం చేశారు. ఉభయ పక్షాలా క్షుద్రులకు ప్రాముఖ్యమూ, నాయకత్వమూ లభించింది. వాళ్ళకు స్వాతంత్ర్య పోరాటంతో గాని, ప్రజలను ఉద్ధరించటంతో గాని నిమిత్తం లేదు; మతోన్మాదం ప్రజలలో రెచ్చగొట్టి రాజకీయోద్యమాన్ని నీరు కార్చటమే ఈ క్షుద్ర నాయకుల పని. వాళ్ళు దేశంలోని మత సఖ్యతా సుహృద్భావాలకు వీలయిన చోటల్లా అగ్గి పెట్టేశారు.

భారతదేశంలో హిందువులు ధనిక వర్గమూ, ముస్లిములు పేద వర్గమూ అని



స్థూలంగా చెప్పవచ్చు. బెంగాలులో జమీందార్లు హిందువులు, రైతులు ముస్లిములు. పంజాబు సింధు రాష్ట్రాలలో వడ్డీ వ్యాపారులు హిందువులు, ఋణగ్రస్తులు ముస్లిములు. అలాటి చోట్ల ముస్లిములను హిందువుల పైకి రెచ్చగొట్టటం తేలిక. మత కలహాల వల్ల ముస్లిములు ధనిక వర్గం ఎలాగూ కారు, కాని జాతీయోద్యమానికి దెబ్బ తగలటం ఖాయం.

ఈ దుస్థితి రాజకీయంగా ఎలా పరిణమించిందంటే, రాజకీయ హక్కుల పెనగులాటా, స్థానాల కోసమూ, నియోజక వర్గాల కోసమూ సంఘర్షణా రాజకీయోద్యమంగా పరిణమించాయి. కాంగ్రెసులో అనేకమంది ముస్లిములున్నారు. వారిలో నిజమైన జాతీయవాదులున్నారు. వాళ్ళు "జాతీయ ముస్లిము పార్టీ" అని కూడా ఒక కూటమి ఏర్పాటు చేశారు. అయితే వారందరూ మధ్య తరగతి అగ్రశ్రేణికి చెందినవారు. ప్రజాసామాన్యంలో వారికి పలుకుబడి లేదు. ముస్లిము మతవాదుల ధాటికి వాళ్ళు తట్టుకోలేరు. అయినా ఆరంభంలో వాళ్ళు మతవర్గాల సామరస్యం కోసం తీవ్రంగానే కృషి చేశారు.

1924 లో కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉండిన మహమ్మదలీ, గాంధీజీ మూడు వారాల నిరశనవ్రతం చేపట్టినప్పుడు, ఢిల్లీలో "యూనిటీ కాన్ఫరెన్స్" ఒకటి జరిపాడు. సామరస్యం కోసం విశ్వప్రయత్నాలు జరిగాయి, కాని ఏ సమస్యా పరిష్కారమయ్యే మార్గం ఏర్పడలేదు.

ఢిల్లీ ఐక్యతా సమావేశం ముగిసిందో లేదో అలహాబాదులో హిందూ ముస్లిము కొట్లాటలు చెలరేగాయి. ఢిల్లీ నుంచి జవాహరు అలహాబాదుకు అతివేగంగా వచ్చి చేరాడు. అప్పటికి కొట్లాటలు నిలిచిపోయాయి, కాని వాటి తాలూకు విషం శాశ్వతంగా మిగిలిపోయింది.





# నవాబు నందిని

## 9

మునిగిపోయిన ఓడలో నుంచి బయట పడినవాళ్ళను రక్షించేందుకు ఇతర పడవలలోవాళ్ళు చాలా మంది నదిలోకి దూకారు. ఉస్మాన్‌ఖాన్ కూడా నీటిలో మునిగాడు. చాలా సేపయాక అతను పైకి తేలాడు గాని, ఏదో బరువు తనను నీటిలోకి లాగుతున్నట్టు కనిపించాడు. ఒక పడవ అతని సమీపానికి వచ్చింది గాని, అందులోకి ఎక్కడం అతనికి సాధ్యంగా కనబడలేదు. పడవలో వాళ్ళొక బట్ట కొనను కిందికి జార్చగా అతను దాన్ని పట్టుకున్నాడు. అతన్ని మెల్లిగా పైకి లాగారు. అతని వెంబడి అయుషా కూడా పైకి వచ్చింది. ఆమెలో ఏమాత్రమూ చైతన్యం లేదు.

అయితే అయుషా చావలేదు. ఆమె కోలుకుని మామూలు మనిషి కావటానికి చాలా కాలం పట్టింది. కాశ్మీరుబేగం నిద్రాహారాలు లేకుండా ఆమెకు శుశ్రూష చేసింది. ఎప్పుడూ తాగి తందనాలాడే సులేమాన్‌ఖాన్ కూడా అయుషా దుస్థితి చూసి దిగులుపడి, తాగటం మరిచిపోయి, ఆమె స్వస్థత గురించి ఆందోళన చెందాడు.

ఇక ఉస్మాన్ సంగతి వేరే చెప్పనవసరం లేదు. అతను రాత్రింబగళ్ళు అయుషా గది నానుకుని ఉన్న వసారాలోనే ఉండేవాడు.

అయుషాకు క్రమంగా స్వస్థత చేకూరింది. ఆమె పక్కమీది నుంచి లేచి ఇటూ అటూ

దామోదర ముఖర్జీ



కదిలే స్థితికి వచ్చింది. ఒకనాడామె ఉస్మాన్‌ను తన గదిలోకి పిలిచింది. గదిలో ఆమె తప్ప ఇంకెవరూ లేరు. ఆమె మంచం తప్ప కూర్చోవటానికక్కడ మరొక ఆసనం కూడా లేదు. ఆయుషా అనుమతితో ఆ మంచం మీదనే ఉస్మాన్ కూడా ఒక పక్క కూర్చున్నాడు.

ఉస్మాన్ అనుమతి లేకుండా తాను దూరదేశం వెళ్ళినందు కామె క్షమాపణ చెప్పుకున్నది.

"నువ్వు చెయ్యగూడని పని చేసినట్టు నే నెన్నడూ అనుకోలేదు. నువ్వు తిరిగి రాగానే నా శరీరంలో మళ్ళీ ప్రాణాలు ప్రవేశించి నట్టయింది. క్షమాపణ అనవసరం," అన్నాడు ఉస్మాన్.

"నేను లేని సమయంలో మన అదృష్టం తారుమారై పోయింది. అందుకు నువు చింతిస్తున్నావా?"

"నువు వెళ్ళావు, అదృష్టం కూడా వెళ్ళి పోయింది."

"అందు కేమీ ఉపాయం లేదా?"

"నువు నా క్షేమం కోరితే ఉపాయాల కేం తక్కువ?"

"నా సుఖదుఃఖాలు నీ పైనే ఆధారపడి ఉన్నాయని ఎరగవా?"

"ఎరగటం వల్లే ఈ బొందెలో ప్రాణాలు నిలుపుకుని ఉన్నాను. కాని, కష్టకాలంలో నన్నెలా విడిచి వెళ్ళిపోయావు?"

"ఈ సంగతి నీవు నన్నడగకుండా ఉంటే బాగుండేది. యువరాజు జగతసింహుణ్ణి చెర విడిపింతామని వెళ్ళాను. ముందు పాట్నాకూ, తరవాత ఆగ్రాకూ వెళ్ళాను."

"నా కా సంగతి తెలియనే తెలియదు. నీ ప్రయత్నం ఒక విధంగా నాకూ అనుకూలమే." అన్నాడు ఉస్మాన్.

"ఎలా?"

"జగతసింహుణ్ణి చంపటం నా జీవితాశయంగా పెట్టుకున్నాను. అతను యావజ్జీవ

కారాగృహ వాసం చేసి అక్కడే మరణిస్తే నా కోరిక నెరవేరే అవకాశం ఉండేదికాదు. అతన్ని నువు విడిపించటం నాకు సహాయం చెయ్యటమే. మొహం తిప్పేసుకున్నావేం? నా మాటలు నీకు కష్టంగా ఉన్నాయా?"

"లేదు. నన్ను దేవు డెందుకు సృష్టించి ఉంటాడా అని ఆలోచిస్తున్నాను. నా వల్ల కలహద్వేషాలు తప్ప మరేమీ కలగలేదు. నీ వంటి ఉత్తమ పురుషుడు నా కోసం లోలోపల దహించుకుపోతున్నాడు.!"

"అలా దహించుకు పోవటం నా కానందమే. నాకు నువు దగ్గిరలో ఉంటే అంతే చాలు," అన్నాడు ఉస్మాన్.

"నా మూలాన బాధపడుతూ కూడా నన్ను చావకుండా ఎందుకు కాపాడతావు?"

"జగతసింహుడు కారాగృహంలో ఉన్నాడంటే దేశం కాని దేశానికి పరిగెత్తావే, నువు చచ్చిపోతే నాకు పిచ్చిఎత్తిపోదా?"

"ఉస్మాన్, నిన్ను వేడుకుంటాను. నీ మనసు నా పై నుంచి మళ్ళించి కర్తవ్యానికి పూనుకో. వీరుడివి, యోధుడివి, సాహసివి—యుద్ధంలో నీ ప్రతాపం చూపించి, సామ్రాజ్యాన్ని గెలుచుకో."

ఉస్మాన్‌ను తాను పెళ్ళాడే అదృష్టం లేదు గాని, అతని వెంటనే ఉండి, అతని కష్టసుఖా లన్నిటిలోనూ భాగం పంచుకోవ





టానికి తనకు అభ్యంతరం లేదనీ, అతని సమస్త యత్నాలలోనూ భాగస్వామిగా ఉంటాననీ ఆయిషా అన్నది. ఆమె అలా సహకరిస్తే తాను పోయిన రాజ్యాన్ని తిరిగి సంపాదించుకునే ప్రయత్నాలను ఉత్సాహంతో చేస్తానని ఉస్మాన్ అన్నాడు...

జగతసింహుడికి కారాగార విముక్తి లభించింది. మానసింహుడి ప్రతిష్ఠకు భంగం కలగలేదు. అక్బరుపాదుషా ఉత్తరువు పై జగతసింహుణ్ణి విడుదల చేశారు. అతను రాజోచితమైన దుస్తులు ధరించి సభాభవనానికి వెళ్ళి, తన తండ్రికి నమస్కారం చేసి, క్షమాపణ వేడాడు.

"నాయనా, నీ తప్పు లన్నిటినీ అక్బరు పాదుషా వారు క్షమించారు," అన్నాడు మానసింహుడు.

జగతసింహుడు కారాగార విముక్తి పొందటమే గాక, మానసింహుడి స్థానంలో బెంగాలు, బిహారు, ఒరిస్సాలకు సుబేదారుగా కూడా నియోగించబడ్డాడు. మానసింహుణ్ణి రావలిసిందని పాదుషా ఆజ్ఞాపించాడు. ఆ తరవాత మానసింహుణ్ణి ఏ పనికి నియోగిస్తారో తెలియదు.

తండ్రి ఆజ్ఞ ప్రకారం జగతసింహుడు తన తండ్రి ఖాళీచేసిన సింహాసనం పైన కూర్చున్నాడు. సభికులందరూ కొత్త సుబేదారుకు అభివందన చేశారు.

సభ ముగియగానే తండ్రికొడుకు లిద్దరూ ఇంటికి వెళ్ళారు. అక్కడ ఊర్మిళాదేవి మందిరంలో జగతసింహుడు తిలోత్తమను తిరిగి కలుసుకున్నాడు. తనను విమల ఊర్మిళాదేవి వద్దకు తీసుకురావటమూ, ఊర్మిళాదేవి తనను ఆదరించి, వెంట ఉంచుకోవటమూ మొదలైన విషయా లన్నిటినీ తిలోత్తమ తన భర్తకు తెలియజేసింది.

మానసింహుడు పాట్నాను సపరివారంగా వదిలి ఆగ్రాకు పోతూ, జగతసింహుడికి తోడుగా అతని తమ్ముడైన మహాసింహుణ్ణి

ఉంచి వెళ్ళాడు. అయితే తిలోత్తమ వైపు వాళ్ళు విమలా, ఆస్మానీ, లక్ష్మణీ, దిగ్గజుడూ పాట్నాకు వచ్చారు.

జగతసింహుడి రాజ్య పరిపాలన కొంత కాలంపాటు ప్రశాంతంగా సాగింది. ఆతనికి జీవితం ఆనందమయంగా గడిచింది. కాని తరవాత రామచంద్రదేవుడి నుంచి ఒక దుర్వార్త వచ్చింది; ఉస్మాన్‌ఖాన్ యుద్ధ సన్నాహాలు మళ్ళీ ఆరంభించాడట. ఒరిస్సాలో మళ్ళీ అశాంతి చెలరేగుతుంది కాబోలునని జగతసింహుడు విచారించాడు.

త్వరలోనే మరొక వార్త వచ్చింది. ఉస్మాన్ పూరీని ఆక్రమించాడు. రామచంద్రదేవు డింకొక దుర్గానికి పారిపోయి తల దాచుకున్నాడు.

మళ్ళీ తలఎత్తిన పఠానులను నాశనం చెయ్యటం తన విధిగా భావించి మహాసింహుడు గొప్ప సేనను తీసుకుని ఒరిస్సాకు వెళ్ళాడు. భద్రకు దగ్గిరలోనే ఉభయ సైన్యాల మధ్య అతి భయంకరమైన యుద్ధం జరిగింది.

ఉస్మాన్ అమితోత్సాహంతో యుద్ధం చేసి, మొగలాయీ సేనలను ఘోరంగా ఓడించాడు. పారిపోతున్న తన సైనికుల వెంట మహాసింహుడు కూడా వెనక్కు మళ్ళవలిసి వచ్చింది.





ఒరిస్సా అంతా మళ్ళీ పఠానుల అధీనమయింది. ఆయుషా ఇచ్చిన ఉత్సాహంతో ఉస్మాన్‌ఖాను బెంగాలును కూడా జయించటానికి బయలుదేరాడు. ఉస్మాన్ ధాటిని మహాసింహుడు ఏమీ అడ్డగించలేక పోవటం చేత జగతసింహుడు కూడా యుద్ధరంగానికి బయలుదేరి వచ్చాడు.

అతి స్వల్పకాలంలోనే పఠానులు మేదినీపూర్, కోల్హానులను పూర్తిగా ఆక్రమించి, మరి కొన్ని ప్రాంతాలను కొంత మేర జయించుకున్నారు. యుద్ధం జరిగినప్పుడల్లా విజయం ఉస్మాన్‌దే. అతని శక్తి సాహసాలను విరోధులే మెచ్చుకునే వారు. ఒరిస్సా లాగే బెంగాలు కూడా పఠానుల వశ మవుతుందని అనుకున్నారు.

ఆయుషా సంతోషానికి మేరలేదు. ఆమె ఆయుధాలు పట్టి యుద్ధరంగంలో పోరాటం మినహాగా యుద్ధక్రమంలో పూర్తి పాత్ర నిర్వహించింది. ఉస్మాన్‌ఖాన్ పొందిన ఉత్సాహం ఇంతా అంతా కాదు. అతన్ని ఎదట పడి జయించటం తన వల్ల కాదని జగతసింహుడు నిశ్చయించుకుని, ఉస్మాన్‌ను చంపే ఉపాయాలాలోచించ సాగాడు. చివర కొక ఉపాయం దొరికింది.

వర్ధమానాన్ని జయించినట్టయితే బెంగాలుదేశ మంతా ఉస్మాన్ చేతికిందికి వస్తుంది. మందారణ దుర్గం స్వాధీనపరచుకుని దాన్ని సైనిక శిబిరంగా వాడుకున్నట్టయితే వర్ధమానాన్ని జయించటం తేలిక. అందుచేత ఉస్మాన్ కొంత సైన్యాన్ని మందారణ దుర్గం పైకి పంపాడు. ఆ సమయంలో జగతసింహుడు వర్ధమానంలోనే ఉన్నాడు. ఆ సంగతి ఉస్మాన్‌కు తెలుసు. జగతసింహుడు ఎప్పుడైనా తన అత్తవారి ఇల్లయిన మందారణకు వస్తాడేమో చూస్తూ ఉండమనీ, అతన్ని ప్రాణాలతో పట్టుకుని తన వద్దకు తీసుకు రమ్మనీ ఉస్మాన్ తన సైనికులకు చెప్పిపెట్టాడు.



ఉస్మాన్ సైనికులు మందారణ దుర్గ ప్రాంతపు అరణ్యాలలో దాగి ఉండి జగత సింహుడి రాక కోసం నిరీక్షించారు, కాని అతను రాలేదు. అతను కొద్ది మంది సైనికులను తీసుకుని, కాలిబాటల వెంట ఒరిస్సా వేపుగా బయలుదేరాడు. ఎలాగైనా ఉస్మాన్‌ను చుట్టుముట్టి చంపెయ్యాలని అతని ఉద్దేశం. అలాటి ఉద్దేశమే ఉస్మాన్‌కు కూడా ఉండటం చేత అతను కూడా కొద్ది మంది సైనికులను తీసుకుని జగతసింహుడి కోసం కారాడుతూ తిరగసాగాడు.

ఒక రోజు జగతసింహుడికి ఉస్మాన్ ఆచోకీ తెలిసింది. అతను కొద్ది మంది సైనికులతో సువర్ణరేఖా నదీ తీరానికి దగ్గిరలో ఉన్నాడు. వెంటనే జగతసింహు డక్కడికి తన సైనికులతో సహా బయలుదేరాడు. జగతసింహుడి రాక పసిగట్టి ఉస్మాన్, తనకు యుద్ధకాంక్ష లేనట్టు గుర్తుగా ఒక సైనికుడికి తెల్లజెండా ఇచ్చి జగతసింహుడి కెదురు పంపాడు. తెల్లజెండా తెచ్చినవాడు జగతసింహుడితో, "మీ మా సైనికుల మధ్య యుద్ధం వల్ల ప్రయోజనమేమీ ఉండదు. ఉభయ పక్షాల వారి ఉద్దేశాల ననుసరించి మీరూ, మా నవాబుగారూ ద్వంద్వయుద్ధం చేసుకోవటం మంచిదని మా నవాబుగారు చెప్పమన్నారు,"



అన్నాడు. జగతసింహుడు తన సమ్మతి ఉస్మాన్‌కు అందజేశాడు. ఉస్మాన్ ఆయుధాలు ధరించి వచ్చాడు.

ఇద్దరూ కలియబడి భయంకరంగా యుద్ధం చేశారు. ఉభయ పక్షాల సైనికులూ ఎడంగా నిలబడి ఆ యుద్ధాన్ని చూశారు. ఇద్దరూ కొంత గాయపడ్డారు, కాని ఒక దశలో ఉస్మాన్ బల్లెం కూడా జగతసింహుడికి దొరికింది. అతనా బల్లాన్ని ఉస్మాన్ తలకు గురిచేసి బలంగా విసిరాడు. దాని తాకిడికి ఉస్మాన్ తల తిరిగిపోయి, కళ్ళు చీకట్లు కమ్మి, నిశ్చేష్టుడై నిలబడ్డాడు. ఆ క్షణంలో జగతసింహుడు తన వద్ద వున్న రెండో బల్లాన్ని ఉస్మాన్ వక్షానికి గురిచేసి బలం కొద్దీ విసిరాడు.

దానితో ఉస్మాన్ ఆ క్షణంలోనే చచ్చి ఉండవలసింది. కాని ఆయుషా, సాక్షాత్కరించిన దేవత లాగా ఉస్మాన్‌కు అడ్డంగా వచ్చింది. అందరూ ఒక్కసారిగా కేక పెట్టారు. ఆ కేకతో ఉస్మాన్ చైతన్యవంతుడై చూసే సరికి బల్లెం ఆయుషా వీపులోకి గుచ్చుకుపోయి ఉన్నది. అది గమనించిన జగతసింహుడు నిలువునా కంపిస్తూ, చేతులు పైకెత్తాడు.

ఆయుషా ప్రాణాలను కాపాడటానికి వైద్యులు వచ్చారు గాని వారి వల్ల ఏమీ కాలేదు. ఆయుషా ఆఖరుసారిగా ఉస్మాన్‌కూ జగతసింహుడికీ వీడ్కోలు చెప్పి కన్ను మూసింది.

జగతసింహుడు తల వంచుకుని కన్నీరు కార్చాడు. ఉస్మాన్ కంటి వెంట నీరు కార్చలేదు. ఒక్క నిట్టూర్పు కూడా విడవలేదు; అతని నోట మాట కూడా రాలేదు.

ఉస్మాన్ ఉత్సాహశక్తులూ, పఠానుల భవిష్యత్తూ ఆయుషాతోనే అంతరించాయి. ఒరిస్సా మొగలాయీల వశమయింది. భారత దేశంలో పఠానుల సామ్రాజ్యమే అంతమైపోయింది. (అయిపోయింది)






# కృతఘ్నురాలు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీవు పడే ఈ శ్రమ మరెవరికొరకో అయి ఉంటుందని నా నమ్మకం. అందుచేత నిన్ను చూస్తే నాకు ఒక బోధిసత్వుడి కథ జ్ఞాపకం వస్తున్నది. శ్రమతెలియకుండా ఉండ గలందులకు నీకు ఆ బోధిసత్వుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

ఒక అరణ్యంలో బోధిసత్వుడు తపస్సు చేసుకుంటూ అరణ్యమంతా తిరిగి, ఆపదలో ఉండే మృగాలనూ, పిశాచాలనూ సైతం కాపాడుతూ ఉండేవాడు. ఒకనా డతను అరణ్యంలో ఇలా తిరుగుతూండగా ఒక పెద్ద బావిలో నుంచి ఒక స్త్రీ ఆక్రందనం వినపడింది. బోధిసత్వుడు అందులోకి

## బేతాళ కథలు





బోధిసత్త్వుడు గడ్డితో తాడు పేని బావి లోని నలుగురు ప్రాణులనూ పైకి తీశాడు. నలుగురూ మనుష్యభాషలో మాట్లాడుతూ ఉండటం గమనించి అతను, "మీ రెవరు? మీ కథ ఏమిటి?" అని అడిగాడు.

సింహం ఇలా చెప్పింది:

హిమాలయాలలో వైదూర్యశృంగ మనే నగరంలో పద్మవేగుడనే విద్యాధరుడికి వజ్రవేగుడనే కొడుకుండే వాడు. వాడు అహంకారి కావటం చేత అందరితోనూ విరోధం పెట్టుకున్నాడు. తండ్రి వాడితో వేగలేక, వాణ్ణి సింహం కమ్మని శపించి, వాడి కెవరు ఉపకారం చేస్తారో వారికి ప్రత్యుపకారం చేసిన మీదట శాపం పోతుం దని చెప్పాడు.

"మహానుభావా, నువు నాకీ ఉపకారం చేశావు. నీకు నా అవసరం కలిగినప్పుడు స్మరించావంటె నేను వచ్చి నీకు ప్రత్యుప కారం చేసి, శాపవిముక్తుణ్ణి అవుతాను," అని చెప్పి, సింహం వెళ్ళిపోయింది.

తరవాత పక్షి తన కథ ఇలా చెప్పింది:

వజ్రదంష్ట్రుడనే విద్యాధర రాజుకు అయిదుగురు కూతుళ్ళ తరవాత రజత దంష్ట్రుడనే కొడుకు పుట్టాడు. ఒకనాడు వాడి పెద్ద అక్క గౌరీదేవి ముందు పెంజ

చూసే సరికి అతనికి ఒక స్త్రీ మాత్రమే గాక, ఒక సింహమూ, ఒక పామూ, ఒక బంగారుకుచ్చుపిట్టా కూడా కనిపించాయి.

"బాబూ, నలుగురు ప్రాణులం. ఈ బావిలో పడ్డాం. మమ్మల్ని బయటికి తీసి కాపాడు," అని ఆ స్త్రీ బోధిసత్త్వుణ్ణి ప్రార్థించింది.

"మీరు పడటంలో అర్థం ఉన్నది, కాని ఎగిరిపోగల ఆ పిట్ట బావిలో ఎలా పడింది?" అని బోధిసత్త్వు డడిగాడు.

"కిరాతులు వేసిన ఉచ్చులో దాని కాళ్ళు ఇరుక్కుపోయాయి. అందుచేత అది ఇప్పు డెగరలేదు," అన్నది స్త్రీ.





రక మనే వాద్యాన్ని వాయిస్తూ ఉండగా, వాడు కొంటెతనంగా దాన్ని లాగేసుకు పోయాడు. ఆమె వాణ్ణి పక్షిగా పుట్టమని శపించి, వాడికి ఉపకారం చేసిన వారికి ప్రత్యుపకారం చేసినప్పుడు శాపం తీరుతుం దని చెప్పింది.

"నేనే అలా శాపం పొందినవాణ్ణి. నీకు అవసరం పడ్డప్పుడు నన్ను తలుచుకుంటే నేను వచ్చి నీకు ప్రత్యుపకారం చేసి శాప విముక్తి పొందుతాను," అని చెప్పి పక్షి వెళ్ళిపోయింది.

తరవాత పాము ఇలా చెప్పింది:

కశ్యపాశ్రమంలో ఒక మునికుమారు డుండేవాడు. వాడి కొక స్నేహితుడుండే వాడు. ఒకరోజున తన స్నేహితుడు కొల నులో స్నానంచేస్తూండగా, గట్టున కూర్చుని ఉన్న మునికుమారుడు తన సమీపంలోకి ఒక పాము రావటం చూసి, మంత్రంతో దాన్ని కట్టేశాడు. తరవాత స్నానంచేస్తున్న వాడు కొలనులో నుంచి ఒడ్డుకు వచ్చి, దగ్గిరలోనే భయంకరమైన పామును చూసి, భయపడి మూర్ఛపోయాడు. మూర్ఛ తెలిసినాక వాడా మునికుమారుణ్ణి పామై పుట్టమని శపించి, ఉపకారికి ప్రత్యుపకారం చెయ్యటమే శాపాంతంగా చెప్పాడు.




"నేనే అలా శాపం పొందిన ముని కుమారుణ్ణి. నీకు నా వల్ల ఉపకారం కావలిసినప్పుడు నన్ను స్మరించినట్టయితే నేను వచ్చి నీ పని తీర్చి శాపం నుంచి విమోచనం పొందుతాను," అని చెప్పి పాము వెళ్ళిపోయింది.

ఆఖరుకు స్త్రీ తన వృత్తాంతం బోధి సత్వుడికి చెప్పింది. ఆమె ఒక క్షత్రియ యువకుడి భార్య. ఆ యువకుడు రాజు వద్ద కొలువుండేవాడు. తన భార్య శీలం మంచిది కాదని తెలిసి అతను ఆమెను శిక్షించ నిశ్చయించాడు. అవినీతిపరురా లైన ఆ భార్యకు ఈ సంగతి దాసీదాని





ద్వారా తెలిసింది. భర్త తనను ఏంచేస్తాడో నని భయపడి ఆమె ఇంటి నుంచి పారి పోయి, రాత్రివేళ చీకటిలో, ఆ నూతిలో పడింది. తన వృత్తాంతం ఈ విధంగా చెప్పి ఆ స్త్రీ తనదారిన తాను వెళ్ళిపోయింది.

ఆ స్త్రీతో మాట్లాడిన ఫలితంగా బోధి సత్త్వుడికి అరణ్యంలో కందమూల ఫలాలు దొరకకుండా పోయాయి. అతను ఆకలితో అలమటించుతూ సింహాన్ని తలుచు కున్నాడు. వెంటనే సింహం వచ్చి, అతనికి లేళ్ళమాంసం తెచ్చిపెట్టి ఆకలి తీర్చి, శాప విమోచనం పొంది, విద్యాధర రూపంతో తన లోకానికి వెళ్ళిపోయింది.

మాంసభక్షణ చెయ్యటం మూలాన బోధిసత్త్వుడి తపస్సుకు భంగం కలిగింది. అతను మామూలు మనుష్యుల లాగే ద్రవ్యంతో జీవించవలిసిన స్థితికి వచ్చాడు. ఆ సమయంలో అతను పక్షిని తలుచుకోగా అది వచ్చి, అతని అవసరం గ్రహించి, ఎక్కడి నుంచో ఒక రత్నాభరణం గల పెట్టె తెచ్చి అతని కిచ్చి, "దీనితో నీవు యావజ్జీవం సుఖంగా బతకవచ్చు," అని చెప్పి, శాపవిముక్తి పొంది వెళ్ళిపోయింది.

బోధిసత్త్వు డా నగలను అమ్ముకుందా మని, సమీపంలోనే ఉన్న గోత్రవర్ధన నగ రానికి వెళ్ళాడు. అక్కడ అతనికి వీధిలో అతను రక్షించిన స్త్రీయే ఎదురై, "నేనిక్కడే ఉంటున్నాను. రాణిగారు నన్ను పరిచారికగా పెట్టుకున్నారు," అని చెప్పింది. అమాయకుడైన బోధిసత్త్వుడు ఆమెకు తన వద్ద ఉన్న రత్నాభరణం చూపి, బంగారుకుచ్చుపిట్ట దానిని ఎక్కడి నుంచో తెచ్చి తన కిచ్చిందని చెప్పాడు. నీతిమాలిన ఆ స్త్రీ, ఇంటికి తిరిగి వెళ్ళి ఈ సంగతి రాణితో చెప్పింది. ఆ రత్నా భరణం రాణిగారిదే. అందుచేత రాణి ఆ స్త్రీ వెంట తమ భటులను పంపి, బోధిసత్త్వుణ్ణి కట్టి తెప్పించింది.

బోధిసత్వుడు నిజం చెప్పాడు. అది నిజమని రాజుకు తెలుసును, ఎందుకంటే పక్షి ఒకటి వచ్చి, రత్నాభరణం గల పెట్టెను ఎత్తుకుపోవటం రాణి స్వయంగా చూసింది. అయినప్పటికీ రాజు బోధిసత్వుణ్ణి విడిచిపుచ్చక, నిర్బంధంలో పెట్టించాడు.

ఖైదులో ఉండి బోధిసత్వుడు పామును తలుచుకున్నాడు. వెంటనే పాము వచ్చి, సంగతి తెలుసుకుని, "నేను వెళ్ళి రాజు తలను చుట్టేస్తాను. నీవు వచ్చి వదలమన్న దాకా వదలను. ఆ రాజు నీకు అర్థరాజ్యం ఇస్తేగాని నన్ను వదలమనకు," అని చెప్పింది. అది తిన్నగా వెళ్ళి, నిద్రపోతున్న రాజు తలకు చుట్టుకుని, దారుణంగా రాజు తలను తన శరీరంతో నొక్కసాగింది. ఎవరైనా సమీపించినా, రాజు తనను వదిలించుకోవటానికి ప్రయత్నించినా అది భయంకరంగా బుసకొట్టింది.

రాజు పెద్ద ప్రమాదంలో పడిపోయి, తనను ఆ ప్రమాదం నుంచి కాపాడిన వారికి అర్థరాజ్యమిస్తానన్నాడు. కారాగృహంలో ఉన్న బోధిసత్వుడు, తానా పామును వదిలించగలనని రాజుకు కబురు చేశాడు. రాజు బోధిసత్వుణ్ణి తన వద్దకు రప్పించి, తనను పాము నుంచి

రక్షించినట్టయితే, అర్ధరాజ్యం ఇస్తానని మంత్రి పురోహితు లందరి సమక్షం లోనూ ప్రమాణం చేశాడు.

అప్పుడు బోధిసత్వుడా పాముతో, "రాజును వదిలిపెట్టు," అన్నాడు. వెంటనే పాము రాజును వదిలిపెట్టి, శాపవిమోచనం పొంది మునికుమారుడుగా మారిపోయింది.

రాజు బోధిసత్వుడికి తన అర్ధరాజ్యం ఇచ్చేశాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. బోధిసత్వుడి చేత ఉపకారం పొందిన నలుగురు ప్రాణులలోనూ ముగ్గురు హీనజన్ములు. అయినప్పటికీ వారు బోధి సత్వుడికి ప్రత్యుపకారం చేశారు; కాని ఉత్తమజన్మ ఎత్తిన స్త్రీ అపకారం చేసింది. దీనికి కారణ మేమిటి? మానవుల కన్న హీన జాతులే ఉత్తములు కావటమా? లేక శాపానికి ముందు వారివి గొప్ప జన్మలు కావటమా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఎంత గొప్ప జన్మలు కలవారైనా సింహమూ, పక్షీ, పామూ దుష్ప్రవర్తన కారణంగానే శాపాలకు గురి అయాయి. అయితే శాపా లనుభవించటం వల్ల వాళ్ళ దోషాలు నశించాయి. స్త్రీ తన అవినీతికి శిక్ష అయినా పొందలేదు. అందుచేత ఆమెలోని కల్మషం నశించలేదు. అదీగాక ఉపకారికి ప్రత్యుపకారం చేస్తేగాని మిగిలిన ముగ్గురికీ శాప విమోచనం లేదు. స్త్రీ విషయంలో అలాటిది లేదు. ఆమె సత్ప్రవర్తన గలది అయితే ఉపకారానికి బదులు చేసి ఉండును; అలాంటిది కానందు వల్ల ఆమె బోధిసత్వుడికి అపకారమే చేసింది," అన్నాడు.

ఈ విధంగా రాజుకు మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# దర్జీవాడియుక్తి

ఒకనాడు అక్బరుపాదుషాతో కబుర్లాడుతూ, మాటల సందర్భాన బీర్బల్, "కొన్ని వృత్తులవాళ్ళు మహా తెలివిగలవాళ్ళు. మనం ఎంత జాగ్రత్తగా ఉన్నా మోసం చేస్తారు," అన్నాడు.

"జాగ్రత్తగా కనిపెట్టి ఉంటే ఎలా మోసం చేస్తారు?" అన్నాడు పాదుషా.

"ఎంతమంది కాపలావాళ్ళను పెట్టినప్పటికీ ఒక చిన్నం బంగారం కాజెయ్యగల కంసాలులనూ, మూరెడుగుడ్డ తస్కరించగల దర్జీలనూ నే నెరుగుదును," అన్నాడు బీర్బల్.

పాదుషా ఈ మాట నమ్మలేక, "నా దగ్గిర ఒక విలువగల సిల్కు తుంపున్నది. ధానితో బేగమ్‌కు చోళీ కుట్టించి చూస్తాం. సిల్కు తుంపు చోళీకి హనీ హనీగా సరిపోతుంది. అందుచేత దర్జీవాడు అందులోనుంచి తస్కరించలేడు. అదిగాక వాడి పైన కాపలా పెడదాం. నీకు మంచి దర్జీ ఎవడైనా తెలుసా?" అని అడిగాడు.

"గులాబ్ అని దర్జీ ఒకడున్నాడు. వాడు మంచి పనిమంతుడూ, చురుకైనవాడూనూ. వాడు బేగమ్‌కు చోళీ కుట్టనూ గలడు, మీ సిల్కు తస్కరించనూ గలడు," అన్నాడు బీర్బల్.

"అయితే వాణ్ణి పిలిపించు, వాడి యుక్తీ శక్తీ పరీక్షింతాం," అన్నాడు అక్బర్.

బీర్బల్ దర్జీవాణ్ణి పిలిపించి, వాడికి సిల్కుగుడ్డ చూపించి, "దీనితో బేగమ్ సాహెబా వారికి చోళీ కుట్టగలవా?" అని అడిగాడు.

దర్జీవాడు నమూనా కొలతలు చూసి, కుట్టగల నన్నాడు. దర్జీవాడు దివాణంలోనే పని పూర్తిచెయ్యాలన్నారు. వాడి కొక గది ప్రత్యేకించారు. వాడు తన దర్జీ పరికరాలన్నిటినీ అక్కడికి తెప్పించుకుని, పని

బి. సూర్యనారాయణ



ప్రారంభించాడు. పని చేసేటప్పుడు వాడి వెంబడి ముగ్గురు రాజోద్యోగులు హమేషా ఉన్నారు. గదిద్వారం వద్ద ఇద్దరు విచ్చు కత్తుల వాళ్ళు కాపలా ఉన్నారు.

దర్జీవాడు మూడు రోజులపాటు పని చేశాడు. ఇంకా చోళీ పూర్తికాలేదు. నాలుగో రోజు దర్జీవాడి కొడుకు ఇంటి నుంచి తండ్రిని చూడవచ్చి, "నాన్నా, నువు ఇంటికి రాక ఇవాళ నాలుగోరోజు. అమ్మ మండిపడుతోంది," అన్నాడు.

"నోరుముయ్యరా, వెధవా. ఇది మన ఇల్లు కాదు, రాజుగారి దివాణం," అన్నాడు దర్జీవాడు.

"అయితే అయింది. నువెప్పుడొస్తావో చెప్పు," అన్నాడు కొడుకు.

"ఇదిగో, ఈ చోళీ పని పూర్తికావాలి," అన్నాడు తండ్రి.

"రెండుగంటల్లో అయే దాన్ని నాలుగు రోజులు కుడుతున్నావా? ఏం దర్జీవి?" అన్నాడు కొడుకు అమర్యాదగా.

"ఇది మీ అమ్మ చోళీ అనుకున్నావట్రా? బేగమ్‌సాహెబా వారిది. నువు పిచ్చి పిచ్చిగా వాగక ఇంటికి పద. లేకపోతే మెడ విరుగుతుంది," అన్నాడు దర్జీ.

తండ్రికొడుకుల ఈ సంభాషణ వింటున్న అక్కడి వాళ్ళంతా విరగబడి నవ్వసాగారు.

"నేను పోను. నా మెడ ఎలా విరుస్తావో చూస్తాను," అంటూ దర్జీ కొడుకు వెటకారంగా నవ్వాడు.

దర్జీకి మండిపోయింది. వాడు తన చెప్పు తీసుకుని కొడుకు మీద. కసిగా విసిరాడు. దర్జీ కొడుకు దాన్ని తీసుకుని బయటికి పరిగెత్తాడు.

"వాణ్ణి పట్టుకోండి!" అని దర్జీ విచ్చు కత్తుల వాళ్ళకు కేకపెట్టాడు. కాని వాళ్ళు వినోదం చూస్తూ నవ్వారే గాని, దర్జీ కొడుకును పట్టుకోవటానికి ప్రయత్నించలేదు.

అ సాయంకాలానికి దర్జీ చోళీని పూర్తి చేసి, పాదుషాకు సమర్పించాడు. పాదుషా దాన్ని తీసుకుపోయి బేగము కిచ్చి, "ఇలాటి చోళీ మరొకటి ప్రపంచంలో లేదు," అన్నాడు. దర్జీవాడి పనితనాన్ని బేగమ్ చాలా ప్రశంసించింది.

కొన్ని రోజులు గడిచాక బేగమ్ ఆ చోళీ ధరించి నగరంలోకి వెళ్ళింది. ఒక చోట ఆమె కొక స్త్రీ కనిపించింది; ఆ స్త్రీ కూడా తాను ధరించిన చోళీ లాటిదే ధరించి ఉన్నది. ఆగ్రహంతో ఆమె రాజభవనానికి తిరిగి వచ్చి, "నా చోళీ లాంటిది ప్రపంచంలో మరెక్కడా లేదంటిరే? ఎవరో సామాన్య స్త్రీ ఇలాటి చోళీయే తొడుక్కుని ఈ సాయంకాలం నాకు కనబడింది," అన్నది పాదుషాతో.

"అసంభవం. నీ చోళీలాంటిదయి వుండదు," అన్నాడు పాదుషా.

"నా కళ్ళతో నేను చూస్తేనే! నా మాటలో నమ్మకం లేదా?" అని బేగమ్ అడిగింది.

బేగం చెప్పిన విషయం దర్యాప్తు చేయించిన మీదట, దర్జీగులాబ్ భార్యకు కూడా బేగమ్ ధరించిన చోళీ లాటిదే ఉన్నట్టు బయట పడింది. పాదుషా దర్జీనీ, వాడి భార్యనూ పిలిపించి, "దుర్మార్గుడా,



నన్నే మోసం చేస్తావా?" అని దర్జీని అడిగాడు.

"ప్రభూ, నా వల్ల ఏ తప్పూ లేదు. నా మీద అంత మందిని కాపలా ఉంచారు గదా, నేను దొంగతనం ఎలా చేస్తాను?" అన్నాడు దర్జీ.

"అలా అయితే, బేగమ్‌కు కుట్టిన చోళీ లాంటిది నీ భార్య కెలా వచ్చింది?" అని పాదుషా అడిగాడు.

"మహాప్రభూ, గుడ్డ అదే, కాని నేను దాన్ని దొంగిలించ లేదు. జరిగిం దేమిటో తమరు చిత్తగించాలి. నేను నాలుగు రోజులపాటు ఇంటికి వెళ్ళకుండా దివాణంలో పనిచేశాను. నన్ను పిలవటానికి వచ్చిన నా కొడుకు నలుగురి ఎదటా నాతో తూస్కారించి మాట్లాడసాగాడు. కోపం వచ్చి వాడి మీద పాదరక్ష విసిరాను. వాడు దాన్ని తీసుకుని పారిపోసాగాడు. కత్తిరించగా మిగిలిన గుడ్డముక్కలు అందులో ఉన్నాయని జ్ఞాపకం వచ్చి, వాణ్ణి పట్టుకోమని కేకపెడితే కాపలావాళ్ళు నా మాట విన్నారు కారు. నే నింటికి వెళ్ళి చూసుకుంటే పాదరక్షలో గుడ్డముక్కలు కనిపించలేదు. దాన్ని చోళీగా కుట్టించుకుని నా భార్య తొడుక్కోగా ఈ సాయంకాలమే చూశాను. నా భార్య తొడుక్కోక పోయినట్టయితే దాన్ని తమకు తప్పక ఇచ్చేసి ఉందును. ప్రభువులు తొడిగి విడిచినవి మేము కట్టుకోవలసిన వాళ్ళమే గాని, మేము విడిచినవి ప్రభువు లెలా తాకుతారు? నా వల్ల తప్పుంటే తల తీయించెయ్యండి," అన్నాడు దర్జీవాడు.

వాడి యుక్తికి పాదుషా ఆశ్చర్యపోయాడు. ఆ దర్జీది కూడా బీర్బల్ జన్మస్థలమేనని తెలిశాక పాదుషాకు వాడి మోసం చూసి సంతోషం కూడా కలిగింది. ఆయన ఆ దర్జీదంపతులకు బహుమానాలిచ్చి పంపేశాడు.





# శక్తివేగుడు

ఒకప్పుడు వర్ధమానపురాన్ని పరోపకారి అనే రాజు పాలించేవాడు. ఆయనకు కనకరేఖ అనే కూతురుండేది. ఆమె అసాధారణ సౌందర్యవతి. ఆమెకు పెళ్ళి ఈడు వచ్చేకొద్దీ, ఆమె వివాహం గురించి తండ్రికి విచారం పట్టుకున్నది. ఆమెకు తగిన వరు డెక్కడ దొరుకుతా డన్నదే ఆయన విచారం. ఈ విషయమే ఆయన ఒకసారి తన భార్యతో అన్నాడు. అంటే ఆయన భార్య, "మీరు పిల్ల పెళ్ళి గురించి ఎందుకు బెంగపడతారు? అది తనకు పెళ్ళే వద్దంటున్నది; తనకు పెళ్ళి గీతే లేదనీ, పెళ్ళి చేస్తే చచ్చిపోతాననీ భయ పెట్టుతున్నది," అన్నది.

ఈ మాటలు విని నిర్ఘాంతపడి, రాజు తన కూతురి వద్దకు వెళ్ళి, "ఏం, తల్లీ? దేవకన్యలు సైతం తమకు మంచి భర్తలు దొరకాలని ఆరాటపడతారు గదా, నువు పెళ్ళే వద్దంటున్నావుట, ఎందుచేత?" అని అడిగాడు.

కనకరేఖ తల వంచుకుని, "నా కిప్పుడు పెళ్ళి చేసుకోవాలని లేదు. శ్రమపడి నా పెళ్ళి చెయ్యటం చేత మీకు కలిగే లాభం మాత్రం ఏముందీ? నాకు లేని చింత మీ కెందుకూ?" అని తండ్రి నడిగింది.

"అదేమిటమ్మా? కన్యాదానాన్ని మించిన పుణ్యం ఏముంటుంది? ఆడది యుక్తవయస్కురాలై తండ్రి ఇంట ఉండటం మహాపాపం," అన్నాడు రాజు.

"సరే అయితే నేను పెళ్ళాడతాను. కాని నన్ను పెళ్ళాడేవాడు బ్రాహ్మణుడైనా, క్షత్రియుడైనా అయి ఉండాలి. అతను కనకపురిని చూసినవాడై ఉండాలి. ఈ రెండు నియమాలకూ భంగం లేకుండా ఎవరినైనా పెళ్ళాడతాను," అన్నది కనకరేఖ.

—కథాసరిత్సాగరం



రాజు పరమానందం చెందాడు. తన కుమార్తెకు అతిసులభంగా భర్త దొరుకుతా డనుకున్నాడు. ఎందుకంటే, కనకపురిని చూసిన బ్రాహ్మణ క్షత్రియ యువకులు అసంఖ్యాకంగా ఉంటారని ఆయన నమ్మకం. ఆ నమ్మకం తోనే మర్నా డాయన సభలోకి వచ్చి కూర్చుంటూనే, "మీలో ఎవరైనా కనకపురిని చూశారా?" అని అడిగాడు. కనకపురిని చూడటం మాట అటుంచి, ఆ పేరు విన్నవారు కూడా సభలో ఎవరూ లేకపోయారు.

అందుకు రాజు ఆశ్చర్యపడి, "బ్రాహ్మణుడు గాని, క్షత్రియుడు గాని కనకపురిని చూసినట్టయితే నా కుమార్తె నిచ్చి పెళ్ళి చేస్తాను," అని నగరంలో చాటింపు వేయించాడు. ఈ చాటింపు పౌరులందరూ విన్నారు. కాని ఒక్కడైనా రాజకుమార్తెను పెళ్ళాడతానని ముందుకు రాలేదు.

ఆ నగరంలోనే బలదేవు డనే బ్రాహ్మణుడి కుమారుడు శక్తిదేవు డనే వాడుండే వాడు. అతనికి జూదమాడే వ్యసనం ఉన్నది. దాని మూలంగా అతను తన డబ్బంతా పోగొట్టుకున్నాడు. ఈ సమయంలోనే అతనికి రాజుగారు వేయించిన చాటింపు వినిపించింది. కనకపురిని చూశానని అబద్ధమాడి రాజకుమార్తెను పెళ్ళాడితే తన కష్టాలన్నీ గట్టెక్కుతాయని అతనికి అనిపించింది.

అందుచేత శక్తిదేవుడు చాటింపు వేసే వాళ్ళను సమీపించి, "నేను కనకపురిని చూశాను. నన్ను మీ రాజుగారి వద్దకు తీసుకుపొండి," అన్నాడు. వాళ్ళు అతన్ని రాజుగారి ముందు పెట్టారు. రాజుగారు అతన్ని కుమార్తె వద్దకు పంపాడు.

కనకరేఖ అతన్ని, "కనకపురిని చూశావా?" అని అడిగింది,

"చూశాను," అన్నాడు శక్తిదేవుడు ఏమీ తడుముకోకుండా.

"ఆ పట్టణానికి ఏ మార్గంగా వెళ్ళావు? ఎప్పుడు వెళ్ళావు? ఆ పట్టణం ఎలా ఉంటుంది?" అని ఆమె మళ్ళీ అడిగింది.

"చదువు కోసం నానాదేశాలూ తిరుగుతూ ఆ పట్టణానికి వెళ్ళాను. ఇక్కడి నుంచి హరపురానికీ, తరవాత వారణాసికీ, అక్కడి నుంచి పౌండ్రవర్ధనానికీ, ఆ తరవాత కనకపురికి వెళ్ళాను. అది ఇంద్రుడి నగరంలా గున్నది. ఎంతో పుణ్యాత్ములు గాని అక్కడ ఉండరనిపించింది," అని శక్తిదేవుడు నిర్భయంగా బొంకేశాడు.

"ఈ ధూర్తుణ్ణి చావగొట్టి పంపెయ్యండి," అని కనకరేఖ తన నౌకర్లకు చెప్పి, తన తండ్రి వద్దకు వెళ్ళి, "ఆ బ్రాహ్మణ యువకుడు పచ్చిమోసగాడు. అతను కనకపురి చూడనేలేదు, చూసినట్టు అబద్ధమాడి మనని మోసగింతా మనుకున్నాడు," అని చెప్పింది.

రాజకుమార్తెతో అబద్ధం చెప్పి అవమానం పొందిన శక్తిదేవుడు, ప్రపంచమంతా తిరిగి అయినా సరే కనకపురిని చూసి ఆ రాజకుమార్తెను పెళ్ళాడాలనీ, లేదా ఆ ప్రయత్నంలో ప్రాణాలు విడవాలనీ నిశ్చయించుకున్నాడు. ఈ విధంగా నిశ్చయించుకుని అతను వర్ధమానం



నుంచి దక్షిణాభిముఖుడై ప్రయాణించి వింధ్యారణ్యం ప్రవేశించాడు.

ఆ మహారణ్యంలో పడి పోగా, పోగా, ఒక పెద్ద చెరువు వచ్చింది. నిర్మలమైన నీరు గల ఆ చెరువులో స్నానం చేసి, అతను ఆ చెరువుకు ఉత్తరపు గట్టున ఉన్న ఆశ్రమంలో ప్రవేశించాడు. అక్కడ ఒక రావిచెట్టు కింద తపస్సు చేసుకుంటున్న వృద్ధుణ్ణి చూసి అతను, "స్వామీ, నేను కనకపురికి వెళ్ళాలి. అది ఎక్కడ ఉన్నదీ తమకు తెలుసా?" అని అడిగాడు.

"నాయనా, నే నీ ఆశ్రమంలో ఉంటున్న ఎనిమిదివందల ఏళ్ళ కాలంలో



కనకపురి పేరు కూడా ఎన్నడూ వినలేదే,"
అన్నాడు తపస్వి.

"అలా అయితే నేను చచ్చేదాకా అది నాకు కనిపించదన్నమాటే!" అన్నాడు శక్తిదేవుడు. అతని కథ అంతా విన్న ఆ వృద్ధ తపస్వి, "నీ కొక సలహా ఇస్తాను. ఇక్కడికి మూడువందల యోజనాల దూరంలో కాంపిల్యదేశం ఉంది. అందులో ఉత్తర పర్వతం మీద ఒక ఆశ్రమంలో నా అన్న ఉన్నాడు. ఒక వేళ ఈ నగరాన్ని ఆయన ఎరుగునేమో వెళ్ళి అడుగు," అన్నాడు.

శక్తిదేవుడికి మళ్ళీ ఆశ చిగురించింది. అతనా రాత్రి అక్కడ గడిపి, మర్నాడుదయమే బయలుదేరి, అనేక కష్టాలుపడి కాంపిల్యదేశం చేరుకుని, ఉత్తర పర్వతం మీద ఉండే మునిని కలుసుకుని, తాను వచ్చిన పని చెప్పాడు. ఆ ముని కూడా కనకపురి పేరెన్నడూ విన్నవాడు కాడు.

"ఆ పట్టణం ఎక్కడో ద్వీపాంతరంలో ఉండి ఉంటుంది. సముద్ర మధ్యాన ఉత్స్థల మనే ద్వీపం ఉన్నది. దాన్ని సత్యవ్రతు డనేవాడు పాలిస్తాడు. అతను అనేక ద్వీపాలతో రాకపోకలు జరుపుతూ ఉంటాడు. అందుచేత కనకపురి జాడ అతనికి తెలియవచ్చు. ముందుగా నువు సముద్రతీరాన గల రేవుపట్టణమైన విటంకపురాన్ని చేరినట్టయితే, ఏ సముద్రవర్తకుడు గాని నిన్ను ఉత్స్థలానికి తీసుకుపోవచ్చు," అని ముని సలహా ఇచ్చాడు.

శక్తిదేవు డా సలహా ప్రకారం విటంకపురం చేరి, అక్కడ సముద్రదత్తు డనే వైశ్యుడితో స్నేహం చేసి, అతని వర్తకనౌకలోనే ఉత్స్థలానికి బయలుదేరాడు. ఆ ద్వీపం చేరవచ్చే సమయంలో సముద్రం మీద పెద్ద తుఫాను లేచి వర్తక నౌక కాస్తా పగిలిపోయింది. సముద్రదత్తు డొక తెప్పపలక ఆధారంతో ఈదు కుంటూ వెళ్ళి ద్వీపాన్ని చేరుకున్నాడు.



సముద్రంలో మునిగిపోయిన శక్తిదేవుణ్ణి ఒక తిమింగిలం లాటి చేప మింగేసింది. ఆ చేప ఉత్స్థల ద్వీప తీరానికి సమీపంగా వెళ్ళి, బెస్తవాళ్ళకు దొరికింది. అంత పెద్ద చేప దొరికినందుకు ఆ బెస్తలు దాన్ని తీసుకుపోయి, తమ రాజైన సత్యవ్రతుడికి కానుకగా ఇచ్చారు. సత్యవ్రతుడు దాన్ని వాళ్ళ చేతనే కోయించే సరికి శక్తిదేవుడు దాని పొట్టలో నుంచి బయటికి వచ్చాడు.

చేప కడుపు నుంచి మనిషి రావటం చూసి నిర్ఘాంతపోయి సత్యవ్రతుడు, "నువ్వెవరు? ఈ చేప పొట్టలో ఏ కారణం చేత పడుకున్నావు? ఏమిటి నీ కథ?" అని అడిగాడు. తాను ఉత్స్థల ద్వీపంలో ఉండే సత్యవ్రతుడి వద్దకు వెళుతూండగా తుఫానులో నౌక బద్దలయిందనీ, తనను చేప మింగిందనీ, మిగిలిన తన వివరాలూ శక్తిదేవుడు చెప్పాడు.

"నేనే ఆ సత్యవ్రతుణ్ణి. నేను అనేక ద్వీపాలు చూశాను గాని, నువు చెప్పే కనకపురిని ఎక్కడా చూడలేదు. కాని దాని పేరు మాత్రం ఎక్కడో ఒక ద్వీపంలో విన్నాను," అన్నాడు సత్యవ్రతుడు.

ఈ మాట వినేసరికి శక్తిదేవుడి ముఖం ముడుచుకుపోయింది. అది చూసి సత్య



వ్రతుడు, "దిగులుపడకు, ఈ రాత్రికి ఇక్కడే ఉండు. రేపు నీ కోరిక తీరటానికి ఏదో ఉపాయం చేస్తాను," అన్నాడు.

శక్తిదేవుడా రాత్రికి ఒక బ్రాహ్మణ మఠం చేరుకుని, అక్కడ భోజనంచేసి, విష్ణుదత్తుడనే బ్రాహ్మణుడితో పరిచయం చేసుకుని, లోకాభిరామాయణం ప్రారంభించాడు. ఆ బ్రాహ్మడు శక్తిదేవుడి సంగతంతా విని, లేచి ఆనందంతో అతన్ని కౌగలించుకుని, "నువు నా మేనమామ కొడుకువురా. నేను చిన్నతనంలోనే ఇక్కడికి వచ్చేశాను," అన్నాడు. దేశం కాని దేశంలో దగ్గిర బంధువు కనబడినందుకు

శక్తిదేవుడు చాలా సంతోషించాడు. ఆ రాత్రి వారిద్దరికీ కబుర్లతో గడిచింది.

తెల్లవారుతూనే సత్యవ్రతుడు మఠంలో శక్తిదేవుణ్ణి చూడవచ్చి, "రత్నకూట మనే ద్వీపంలో ప్రతి ఆషాఢశుద్ధద్వాదశికీ దేవుడి ఉత్సవాలు జరుగుతాయి. అప్పుడు నానా ద్వీప వాసులు అక్కడికి చేరుతారు. ఆ ఉత్సవం దగ్గిరలోనే ఉన్నది గనక నిన్ను నే నక్కడికి తీసుకుపోతాను. అక్కడ నీకు కావలిసిన సమాచారం సులువుగా తెలియవచ్చు," అన్నాడు.

శక్తిదేవుడు సరేనని, విష్ణుదత్తుడి వద్ద దారిబత్తెం తీసుకుని, సత్యవ్రతుడు నడిపే పడవలో ఎక్కాడు. సముద్రం మీద వారికి అంత దూరాన రెక్కలు గల మహాపర్వతం లాగా ఏదో కనిపించేసరికి శక్తిదేవుడు అదేమిటని అడిగాడు. "అది వటవృక్ష దేవుడు. దాని కింద బడబాముఖంలో పెద్ద సుడి ఉన్నది. అది చాలా ప్రమాదకర మైనది. మనం దానికి చాలా ఎడంగా వెళ్ళాలి," అన్నాడు సత్యవ్రతుడు.

కాని అప్పటికే పడవ సుడిగుండానికి చిక్కింది. అది క్రమంగా ఆ చెట్టు కేసే పోసాగింది. "బాబూ, మనకు ప్రమాదం తప్పదు. నన్ను గురించి నా కేమీ చింత లేదు. కాని ఇంత శ్రమపడి కూడా నీ కోరిక నిష్ఫల మవుతుందనే నాకు చింత. పడవ చెట్టును సమీపించేటప్పుడు చెట్టుకొమ్మను పట్టుకుని ప్రాణం కాపాడుకోవటానికి ప్రయత్నించు," అన్నాడు సత్యవ్రతుడు.

శక్తిదేవుడు ఒక్క ఎగురు ఎగిరి మర్రి కొమ్మను అందుకుని, పైకి వెళ్ళాడు. మరు క్షణమే పడవ, సత్యవ్రతుడితో సహా, సుడి గుండంలో మునిగిపోయింది. "కనకపురిని చూద్దామని బయలుదేరి, నా కోసం ప్రాణా లర్పించిన పల్లెరాజును చూశాను," అని శక్తిదేవుడు చాలా బాధపడ్డాడు.

—(ముగింపు వచ్చే సంచికలో)





# నీటి ఎద్దడి

పాపన్న మేనమామ ఒకాయన చాలా ఏళ్ళ క్రితం దేశాలు పట్టి పోయాడు. ఆయన ఇటీవల తిరిగి వచ్చాడనీ, కొడుకులూ కోడళ్ళూ అయనను దగ్గిర చేరనివ్వలేదనీ, ఆయన కొండల అవతల ఎక్కడో ఉండి, ముసలితనంలో నానా అగచాట్లూ పడుతున్నాడనీ తెలియవచ్చింది. తన అన్న గురించి ఇలాటి వార్త విని, పాపన్న తల్లి చాలా బాధపడి, "నువు వెళ్ళి అన్నయ్యను తీసుకురారా," అన్నది కొడుకుతో.

పాపన్న బండి కట్టుకుని తన మేనమామను వెతుక్కుంటూ బయలుదేరాడు. కొండల మధ్యన బండిబాట నిలిచిపోయింది. అక్కడి నుంచి కాలిబాట మాత్రమే ఉన్నదనీ, కొండల అవతల ప్రజలు నీటిఎద్దడితో బాధపడుతున్నారనీ పాపన్నకు తెలియవచ్చింది. అందుచేత పాపన్న తన బండినీ, ఎద్దునూ ఒక గ్రామంలో గ్రామపెద్ద ఇంట ఉంచి, ఎద్దు మేతకు కొంత డబ్బిచ్చి, కాలినడకన కొండల అవతలి ప్రాంతానికి చేరుకున్నాడు.

కొండల అవతల ఉండే మైదానాలను చేరుకోగానే అతనికి, ఎక్కడి నుంచో నెత్తిన నీటి బిందెలు పెట్టుకుని ప్రయాణాలు చేస్తున్న స్త్రీలూ, పురుషులూ చాలామంది కనిపించారు.

పాపన్న ఈ ప్రాంతానికి బయలుదేరేటప్పుడు కొన్ని రొట్టెలూ, పెద్ద చెంబుతో నీళ్ళూ తెచ్చుకున్నాడు. కాని ఆ రొట్టెలు అయిపోయాయి. దారిలో కనిపించే వాళ్ళను అతను, "ఈ దగ్గిర ఎక్కడన్నా పూటకూళ్ళ ఇల్లుందా?" అని అడిగాడు.

"పది మైళ్ళ మేరలో ఎక్కడా పూటకూళ్ళ ఇల్లు లేదు. ఈ ప్రాంతాల వాళ్ళు తమ పంట తామే చేసుకుంటారు," అని జవాబు వచ్చింది.



"వంట చేసుకుంటాను. స్వయంపాక మైనా దొరుకుతుందా?" అని పాపన్న మళ్ళీ అడిగాడు.

"ఏది కావాలన్నా బండారయ్య ఇంటనే దొరుకుతుంది. ఆయన ధరలు విపరీతం. కాని ఈ చుట్టుపక్కల ఏది కావాలన్నా ఆయన దగ్గిరే కొనాలి. చివరకు మంచి నీళ్ళు కూడా ఆయన బావివే ఇక్కడి వాళ్ళకు గతి," అని పాపన్న తెలుసు కున్నాడు. బండారయ్య నీటిని కూడా విపరీతమైన ధరలకు అమ్ముతాడట.

పాపన్న నీళ్ళతోనైనా తన ఆకలి చంపుకుందామని, నీళ్ళ బిందె నెత్తిన పెట్టుకుని వెళ్ళే మనిషి నొకణ్ణి తన చెంబు నిండా నీరు పొయ్యమన్నాడు. ఆ మనిషి నిర్దాక్షిణ్యంగా పొయ్యననేశాడు. అతను మాత్రం ఏం చేస్తాడు? ఆ బిందెడు నీళ్ళూ రోజల్లా నలుగురికి సరిపోవాలి. అందులోనూ బోలెడంత డబ్బుపోసి కొనుక్కున్న నీళ్ళు!

మరో మనిషి పాపన్న వద్ద నాలుగణాలు తీసుకుని అతని చెంబు నించాడు. ఆ మని షినీ తప్పు పట్టి లాభం లేదు. అతను మూడుమైళ్ళ పైచిలుకు దూరం నుంచి వచ్చి, బిందెడు నీళ్ళకు గాను పావలా ఇచ్చి ఆ నీటిని మోసుకుపోతున్నాడు.

"మీ రింత అగచాట్లు పడటం దేనికి? మీ మీ ప్రాంతాలలో బావులు తవ్వుకో రాదా?" అని పాపన్న అడిగాడు.

"ఈ ప్రాంతాని కంతకూ బండారయ్యే గుత్తదారు. ఆయన ఇంకా అనేక చోట్ల బావులు తవ్వించాలని ప్రయత్నిస్తే క్షేత్రజ్ఞులు, ఆ ప్రదేశమంతా శిలామయ మనీ, ఒక్క చుక్క నీరు పడదనీ అన్నా రట. ఈ మాట బండారయ్యే చెప్పాడు. ఏమైనా ఆ పుణ్యాత్ముడా బావినీళ్ళన్నా పదిమందికీ ఇస్తున్నాడు గనక ఇక్కడి వాళ్ళ ప్రాణాలింకా నిలిచి ఉన్నాయి," అన్నాడు నీళ్ళు అమ్మినవాడు.

మరీ నోరెండి నప్పుడల్లా నోరు తడి చేసుకుంటూ, ఆకలిని సహిస్తూ పాపన్న ముందుకు సాగాడు. అతను ఆ ఎగుడు దిగుడు కాలిబాటన నడిచిపోతూండగా ఒక పల్లంలో ఒక వృద్ధుడు పడిపోయి, హీన స్వరంతో, "దా-హం!" అంటూ అలమటించటం పాపన్న కంట పడింది. అతను ఆగి, తన చెంబులో ఇంకా మిగిలి ఉన్న నీటిలో కొంత ఆ ముసలాడి నోట పోసి, మిగిలినవి తాను తాగేశాడు.

ఆ సమయంలో ఒకడు ఖాళీ బిందెతో అటుగా పోతూ, "ఎవరు నాయనా, నువు? ఆ ముసలాడి నోట్లో నువు నీళ్ళుపోసినట్టు తెలిస్తే ఆ బండారయ్యగారు నీకు ఒక్క చుక్క నీరివ్వడు. ఆయనకు కోపం వచ్చిందంటే ఈ ప్రాంతాలలో ఎవరూ నిన్ను క్షణం నిలవనివ్వరు," అన్నాడు.

"ఏం? ఈ ముసలాడు బండారయ్యగారికీ, ఇక్కడి ప్రజలకూ అంత గొప్ప ద్రోహం ఏం చేశాడు?" అని అడిగాడు పాపన్న.

"వీడొక దగాఖోరు. ఈ గుడ్డి ముండా కొడుకు చావు కోసమే అందరమూ ఎదురు చూస్తున్నాం," అన్నాడా మనిషి.

పాపన్న ఆ ముసలాడి కేసి చూసి ఆయనకు కళ్ళు లేవని తెలుసుకున్నాడు.



ఆ వృద్ధుడు పాపన్న పోసిన నీటితో కొంచెంగా తెప్పరిల్లాడు గాని, ఇంకా మాట్లాడే స్థితిలో లేడు. పైపెచ్చు మరి కాసిని నీళ్ళు కావాలని సంజ్ఞ చేస్తున్నాడు.

పాపన్న కేం చెయ్యటానికీ పాలుపోలేదు. తాను బండారయ్య బావి దాకా వెళ్ళి నీళ్ళు తెచ్చిన దాకా ముసలాడి ప్రాణం నిలుస్తుందో, నిలవదో. నీళ్ళు తెచ్చేవాళ్ళ దగ్గిర ఇంకో చెంబెడు నీళ్ళు కొందామన్నా అలాటి మనుషు లెవరూ అటుకేసి రావటం కనిపించలేదు.

ఇంతలోనే సమీపంలో ఎవరో ఆడ మనిషి కెవ్వున అరవటం వినిపించింది.



పాపన్న వెంటనే తా నున్న పల్లంలో నుంచి కేక వినిపించిన దిక్కుగా పరిగెత్తాడు.

కొద్ది దూరంలోనే ఇద్దరు మొరటు మనుషులు, దుడ్డుకర్రలతో ఒక ఆడ మనిషిని బెదిరిస్తూ, ఆమె మోసుకొస్తున్న నీళ్ళ బిందెను లాక్కోవటానికి యత్ని స్తున్నారు. పాపన్న పులి లాగా ఒకడి మీద పడి, వాణ్ణి డొక్కలో చాచి తన్ని, దుడ్డుకర్ర లాక్కుని రెండోవాణ్ణి రెండు బాదేసరికి ఇద్దరు రౌడీలూ కాలికి బుద్ధి చెప్పారు.

"ఈ నీళ్ళదొంగలతో చావుగా వుంది, నాయనా. దేవుడల్లే వచ్చి అడ్డుపడకపోతే మా గతి ఇవాళ ఏమయేదో!" అన్నదా స్త్రీ.

"నిన్నూ దేవుడే పంపాడు. నేనూ, ఇంకో ముసలాయనా దప్పికతో చస్తున్నాం. నా చెంబులో కాసిని మంచినీళ్ళు పోసిపో, తల్లీ," అన్నాడు పాపన్న. ఆమె జాగ్రత్తగా, ఒక్క చుక్క నేల రాలకుండా, పాపన్న చెంబు నింపింది.

పాపన్న ఆ నీరు కొంత ముసలాయన నోట పోసి, మరి కొంత తాను తాగాడు.

ముసలాయనకు పాపన్న నీరు పొయ్యటం చూడగానే ఆ స్త్రీ గతుక్కుమని, భయంగా అటూ ఇటూ చూడసాగింది.

"భయపడకమ్మా. నేను రాజుగారితో మాట్లాడి బండారయ్య ఆట కట్టిస్తాలే. ఈ ముసలాయన బండారయ్యకు చేసిన ద్రోహ మేమిటో నీకేమైనా తెలుసా?" అన్నాడు పాపన్న.

ఆమె ఆ ముసలాయన కథ ఈ విధంగా చెప్పింది:

ముసలాయన క్షేత్రజ్ఞుడు. జలవేది. నీరెక్కడ పడేదీ చెప్పగలడట. ఆయన బండారయ్య దగ్గిరికి వెళ్ళి, ఎక్కడెక్కడ బావులు తవ్వాలో చెబుతాననీ, తన కేదైనా ఇప్పించమనీ కోరాడట. "నేను ఈ ప్రాంతా లంతటా పరీక్ష చేయించాను. ఎక్కడా జలం పడదు," అని బండారయ్య అన్నాడు.

"అలా కాదు. రెండు మూడు చోట్ల చాలా తక్కువ లోతునే నీరున్నది. నేను పరీక్ష చేసే చెబుతున్నాను," అన్నాడు ముసలాయన.

ముసలాయన చెప్పిన చోట తవ్వించి చూడమని పదిమందీ బండారయ్యను ఒత్తిడి చేశారు.

"సరే, ఒకచోటు చూపించు. అక్కడ తవ్విస్తాను. నీరు పడిందా నీకు ఇరవై రూపాయలిస్తాను. లేదో, నిన్ను ప్రాంతాల వాళ్ళు బతకనివ్వరు," అన్నాడు బండారయ్య, పదిమందీ వింటూండగా.

ఆ తరవాత బండారయ్య ముసలాయనను వెంటబెట్టుకుని సందె చీకట్లో బయలుదేరాడు. ముసలాయన బండారయ్యను ఒక నిర్జన స్థలానికి తీసుకుపోయి, "ఇక్కడ తవ్వించండి. ఇరవై అడుగుల లోతున నీరు పడుతుంది," అన్నాడు.

మర్నాడు బండారయ్య మనుషులను తీసుకుపోయి తవ్వకం సాగించాడు. అయితే అతను బావి తవ్వించినది ముసలాయన చెప్పిన చోట కాదు, మరొక చోట. ఎంత తవ్వినా నీరు పడలేదు.

"చూశారా, ఈ దుర్మార్గుడు డబ్బుకు కక్కుర్తిపడి మనకు లేనిపోని ఆశపెట్టాడు.



ఎవరూ వీడికి పిడికెడు బిచ్చం పెట్టకండి. గుక్కెడు మంచినీళ్ళివ్వకండి. చస్తే, చచ్చిన చోటనే పాతెయ్యండి," అని అందరినీ బండారయ్య హెచ్చరించాడు. నీళ్ళు అమ్ముకుని డబ్బుచేసుకో దలిచిన బండారయ్యకు ముసలాయన మీద కక్ష ఉండటం సహజమే. పలుకుబడి కలవాడు గనక, ముసలాయనను ఆకలిదప్పులతో హతమార్చటానికి ఒడిగట్టాడు.

"బండారయ్య నేను చెప్పిన చోట బావి తవ్వటం లేదని నెత్తి, నోరూ బాదుకుని చెప్పాను. ఎవరూ నా మాట విన్నారు కారు. నేనా గుడ్డివాణ్ణయి పోతిని. నేను



నీరు పడుతుందన్న చోట పడి తీరుతుంది. కళ్ళు పోయాక నాకీ శక్తి ఒకటి సిద్ధించింది. నాకు భూమిలో ఉండే నీటి గలగల వినిపిస్తుంది. ఎక్కడి మాటో ఎందుకు? నేను పడి ఉన్న ఈ చోటనే పదిహేనడుగుల లోతున నీరున్నది," అన్నాడు ముసలాయన, పాపన్న పోసిన నీళ్ళతో కొంచెం తేరుకుని లేచి కూర్చుని.

పాపన్న ముసలాయనను మాటలలో పెట్టి, ఆయనే తన మేనమామ అని తెలుసుకున్నాడు.

"నువ్వేనా మామయ్యా? నీ కోసమే నేను బయలుదేరి వచ్చాను. దేశం కాని దేశాలు తిరిగి, నువు ముసలితనంలో అష్టకష్టాలు పడుతున్నావని విని అమ్మ నిన్ను తీసుకురమ్మన్నది," అన్నాడు పాపన్న.

వాళ్ళిలా మాట్లాడుకుంటుండగా వై బండారయ్య బావి నుంచి కొంత మంది గట్టిగా మాట్లాడుకుంటూ ఖాళీ బిందెలతో అటుగా వచ్చారు. ఏమిటి సంగతి అని అడిగితే బండారయ్య బావిలో ఎవరో పడి చచ్చినట్టు తెలిసింది. ఆ ప్రాంతాల ఉన్నదే ఒక్క బావి. ఆ నీళ్ళు కూడా జనానికి ప్రాప్తం లేకుండా పోయాయి.

పదిమందీ చేరారు. పాపన్న వాళ్ళతో, "ఇప్పటికన్నా కళ్ళు తెరవండి. ఇదంతా నీరు లేని ప్రాంతమని బండారయ్య మిమ్మల్ని నమ్మించి మోసం చేస్తున్నాడు. మేం కూర్చున్న ఇక్కడే నీరు పడుతుంది. పలుగులూ, పారలూ, తట్టలూ తెచ్చి పదిమందీ పూనుకుంటే ఈ పూటే బండారయ్య బండారం బయట పెట్టవచ్చు," అని ప్రోత్సహించాడు.

పాపన్న మాటలలో వాళ్ళకు గురి కుదిరింది. రెండు గడియల లోపుగా జనం పనిముట్లతోనూ, ముసలాయనకు తిండి తీసుకుని వచ్చారు. బావి పని అతి చురుకుగా సాగింది.

పొద్దువాలే లోపుగా నీరు తగిలింది. జనం పొందిన ఆనందానికి మేరలేదు. చీకటి పడే లోపుగా వందల కొద్దీ జనం పోగయారు. కాగడాలు వచ్చాయి. ఎవరో కొబ్బరికాయలూ, హారతి కర్పూరమూ కూడా తెచ్చారు.

మర్నాడు తెల్లవారే సరికి దాదాపు నిలువు లోతు నీళ్ళు గల బావి తయారయింది. బావికి టెంకాయలు కొట్టి, హారతి ఇచ్చారు. పాపన్న వచ్చిన వారందరికీ కడవలు ముంచి నీరు అందించాడు. పాపన్న పేరూ, ముసలాయన పేరూ చెప్పుకోనివాళ్ళు లేరు.

ముసలాయన ఆ ప్రాంతాలవారికి దేవుడై పోయాడు. ఆయనను ఆ ప్రాంతమంతా తిప్పి, ఇంకెక్కడెక్కడ బావులు తవ్వవచ్చునో చూడమన్నారు. ఆయన సహాయంతో మరి మూడు నాలుగు బావులు ఆ నిర్జన ప్రాంతంలో వెలిశాయి.

ఆ ప్రాంతాల వారికి నీటిఎద్దడి లేకుండా పోయింది. జనానికి తాగే నీరే గాక, కూరగాయలు పండించుకునేటందుకు కూడా తగిన నీరు లభ్యమయింది.

పాపన్న రాజుగారి దివాణంలో బండారయ్య చేసే దురాగతాలను గురించి పెద్ద ఫిర్యాదిచ్చి, తన మామను ఇంటికి తీసుకుపోయాడు. పాపన్న తల్లి తన అన్నను చాలా కాలానికి చూసి సంతోషించింది. తరవాత రాజుగారు ముసలాయనను పిలిపించి, ఆయన చేసిన ఉపకారానికి మంచి సన్మానం చేశాడు. బండారయ్య గుత్తాధికారాలన్నీ రద్దయాయనీ, అతనికి భారీగా జరిమానా పడిందనీ, వ్యాపారం చేసుకునే హక్కు అడిగినవారి కల్లా ఇవ్వబడిందనీ, కొండ అవతల ప్రాంతంలో వస్తువుల ధరలు అదుపులోకి వచ్చాయనీ, అక్కడి ప్రజలు సుఖంగా బతుకుతున్నారనీ పాపన్నకు తెలిసింది.






# పిచ్చివాడి తెలివి

ఒక ఆటవిక రాజ్యంలో నేర్పరి అయిన కమ్మరి ఒక డుండేవాడు. ఆ రాజ్యంలో గల వేటగాళ్ళూ, వ్యవసాయదార్లూ తమకు కావలిసిన పరికరాలను ఆ కమ్మరి చేతనే చేయించుకునేవారు.

ఒక రోజు ఉదయం కమ్మరి తన కొలిమికి తిత్తిపోసి పని ప్రారంభించబోతుండగా, రాజభటు డొకడు వచ్చి, రాజుగారు వెంటనే రమ్మంటున్నారని చెప్పాడు. వెంటనే కమ్మరి కొలిమి ముందు నుంచి లేచి, బట్టలు మార్చుకుని రాజుగారి వద్దకు బయలుదేరాడు.

కమ్మరి వచ్చాడని భటులు చెప్పగానే రాజు అతన్ని తన సమక్షానికి రప్పించి, అనేక ఉక్కుముక్కలు అతని ముందు పెట్టి, "నువు వీటిని తీసుకుపోయి కరిగించి, మనిషిని తయారుచెయ్యాలి. ఉక్కుతో చేసిన మనిషి కాదు—రక్తమాంసాలు గలిగి, అన్ని పనులూ చేస్తూ ఆలోచించగల ఉక్కుమనిషిని తయారుచెయ్యాలి. నీకు నెలరోజులు గడు విచ్చాను," అన్నాడు.

కమ్మరికి మతి పోయినట్టయింది. రాజాజ్ఞకు ఎదురు చెప్పటానికి లేదు. చెప్పినట్టు చెయ్యకపోతే రాజు తల తీయించేస్తాడు. అందుచేత కమ్మరి గుండెలో రాయి పడింది. అతను రాజుకు వంగి నమస్కారం చేసి, ఇంటి దారి పట్టాడు.

తరవాత కమ్మరి మిత్రులంతా అతని ఇంటికి వచ్చి, అతనికి ఏర్పడిన ప్రమాద పరిస్థితి గురించి తెలుసుకున్నారు. ఆ ప్రమాదం నుంచి అతను బయట పడటానికి తలా ఒక మార్గమూ చెప్పారు.

కాని ఈ సూచనలేవీ కమ్మరికి ఆచరణ యోగ్యంగా తోచలేదు. అతను అహోరాత్రాలు మనోవ్యాధికి గురి అయి, నిద్రాహారాలు మాని, మనుషుల మధ్య ఉండలేక,

ఎస్. ఆనందరావు

అరణ్యంలో తిరుగుతూ, తనలో తాను మాట్లాడుకునే స్థితికి వచ్చాడు.

ఇలా అతను తిరుగుతూండగా అరణ్యంలో ఒక చోట ఒక పిచ్చివాడు అకస్మాత్తుగా ఎదురుపడి, "నువ్వేనా కమ్మరన్నా? ఈ పూట మా ఇంటికి విందుకు రావాలి," అన్నాడు.

ఈ పిచ్చివాడు కమ్మరికి పాత స్నేహితుడే. కొంత కాలం కిందట అతనికి మతి చలించింది. అది మొదలు అతను అరణ్యం లోనే తిరుగుతున్నాడు; ఎవరి కంటా పడటం లేదు.

ఆ పిచ్చివాణ్ణి చూడగానే కమ్మరికి జాలితో బాటు అసూయ కూడా కలిగింది. వాడికి ఏ విచారమూ లేదు, హాయిగా ఉన్నాడు.

కమ్మరి నా పిచ్చివాడు ఒక చెట్టు కిందికి తీసుకుపోయి, "ఇదే మన ఇల్లు. ఇదుగో విందు!" అంటూ ఇన్ని నేరేడు పళ్ళూ, తేనెపట్టూ తెచ్చి కమ్మరికి ఇచ్చాడు. ఇద్దరూ నేరేడు పళ్ళు తిని, తేనెపట్టు పిండుకు తాగారు. చాలా రోజులుగా తిండిలేక మాడుతున్న కమ్మరి కీ భోజనం అమృతం లాగా ఉన్నది.

ఏ బుద్ధిన ఉన్నాడో కమ్మరి ఆ పిచ్చివాడితో, రాజుగాడు తన కిచ్చిన పని



గురించి చెప్పి, "ఉక్కుతో నిజమైన మనిషిని చెయ్యమంటాడు రాజు. అది సాధ్యమా? చెయ్యకపోతే నన్ను రాజు చంపేస్తాడు," అన్నాడు.

పిచ్చివాడు కొంచెం ఆలోచించి, "ఉక్కుతో మనిషిని చెయ్యొచ్చునే! అదేం కష్టం?" అన్నాడు.

"ఎలా?" అన్నాడు కమ్మరి.

పిచ్చివాడు కమ్మరికి దగ్గిరగా జరిగి, "ఇది రహస్యం. స్నేహితుడివి కనక చెబుతున్నాను. కొలిమిలో మనిషి వెంట్రుకలతో మంట చేసి ఉక్కు కరిగించాలి. మంట మరీ జాస్తి అయినప్పుడు మనిషి

కన్నీళ్ళు చల్లుతూ ఉండాలి. అలా కరిగించి పోత పోస్తే నిజమైన మనిషి తయారవుతాడు. ఈ రహస్యం జ్ఞాపకం ఉంచుకో!" అని చెప్పాడు.

కమ్మరి తలలో ఒక ఆలోచన మెరిసింది. "బాగుందన్నా, నువు చెప్పినట్టే చేస్తాను. మళ్ళీ కనిపిస్తాను," అంటూ అతను పిచ్చివాడి దగ్గిర సెలవు తీసుకుని, తిన్నగా రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, ఉక్కుతో మనిషిని చెయ్యటానికి ఏర్పాట్లన్నీ చేశాను. నాకు కావలిసిన సరుకు సామాను తమరు తెప్పించాలి," అన్నాడు.

ఆ సామానేమిటని రాజు అడిగాడు.

"ఉక్కు కరిగించటానికి బొగ్గు పనికి రాదు. మనిషి వెంట్రుకలు కావాలి. అవి ఒక వెయ్యి బళ్ళు తెప్పించండి. కొలిమి మరీ వేడెక్కినప్పుడు చల్లటానికి మనిషి కన్నీరు కావాలి. అవి ఒక వెయ్యి కడవలు తెప్పించండి. ఇవన్నీ దగ్గిర పెట్టుకుని కాని ఉక్కుమనిషిని చేసే పని ప్రారంభించటానికి లేదు," అన్నాడు కమ్మరి.

రాజు సరేనని తన భటులను రాజ్యం మీదికి పంపాడు. వాళ్ళు తిరిగి వచ్చి, "మహారాజా, కమ్మరి కోరే సామాన్లు దొరికేటట్టు లేవు. ఒక బండెడు వెంట్రుకలూ, ఒక కడివెడు కన్నీరూ అయితే దొరుకుతుందేమో గాని అంతకు మించి దొరకదు," అని చెప్పారు.

రాజు నిరుత్సాహం చెంది, కమ్మరిని పిలిపించి, "ఉక్కుతో మనిషిని చెయ్యటానికి కావలిసిన ద్రవ్యాలు, రాజ్యంలో ఎక్కడా దొరికేటట్టు లేవు. పోనీ ఆ పని మానేద్దాం," అన్నాడు.

కమ్మరి, ప్రాణాలు కుదటపడి, బతుకు జీవుడా అని ఇంటికి చేరుకున్నాడు. అతను అరణ్యంలో ఉంటున్న పిచ్చివాణ్ణి తెచ్చి తన ఇంట్లోనే ఉంచుకుని, తిండీ బట్టా ఇచ్చి పోషించాడు.





# మహాబలులు

ఒక అరణ్యానికి సమీపంలో ఒక బలాఢ్యు డుండేవాడు. అతని పేరు శరభయ్య. ఆ శరభయ్య, ప్రపంచంలో తనను మించిన బలాఢ్యుడు లే డనుకునేవాడు. ఎందుచేత నంటే, అతను అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి, మామూలు కట్టెలమోపుకు పదింత లుండే మోపు కట్టి, దాన్ని ఇంటికి తెచ్చి, తన పెళ్ళాంతో, "నేను కలియుగ భీముణ్ణి! చూడు, ఎంత పెద్ద మోపు తెచ్చానో!" అనే వాడు.

"భీముడివా? నిజంగా భీము డెదురైతే పారిపోవూ? బలవంతుడివే, ఎవరు కాదం టారు? మహాబలుడివి మటుకు కావు," అనేది శరభయ్య భార్య దుర్గమ్మ.

ఈ మాట వినగానే శరభయ్యకు కోపం వచ్చి, "మాటలతో పనేమిటి? నా కన్న బలం గలవాణ్ణి చూపించు, అప్పుడు నమ్ముతా!" అనేవాడు.

ఒకనాడు దుర్గమ్మ నెత్తిన పెద్ద కుండ పెట్టుకుని, నీళ్ళు తేవటానికి బావికి వెళ్ళింది. ఆమె బావిలో చేద వేసి తోడ బోతే అది విపరీతంగా బరువెక్కి పైకి రాలేదు. ఆమె ముచ్చెమటలు పోసేదాకా ప్రయత్నించింది, కాని ఫలితం లేక పోయింది. చివరకు ప్రాణం విసిగి, చేదను బావిలోనే వదిలేసి, ఖాళీకడవ చంకన పెట్టుకుని ఇంటిదారి పట్టింది.

ఆమె కాలిబాట వెంబడి నడుస్తూండగా, అరణ్యమార్గం నుంచి వచ్చే మరొక కాలి బాట మీదుగా ఇంకొక స్త్రీ, చంకన చంటి బిడ్డను పెట్టుకుని, చేత ఖాళీకడవ పట్టు కుని, నీటికై బావి వద్దకు వస్తూ దుర్గమ్మకు ఎదురయింది.

"ఖాళీ కడవతో తిరిగి వస్తున్నావేం? బావి ఎండిపోయిందా ఏం?" అని రెండో మనిషి దుర్గమ్మ నడిగింది.

పి. వెంకటపతిరాజు



"లేదమ్మా, బావిలో వేసిన చేద పది మంది పట్టి లాగితే గాని పైకి రాకుండా ఉంది. బావిలో ఏ భూతమో చేరినట్టుంది," అన్నది దుర్గమ్మ.

"అంతే కద. నా వెంట రా. నీకు కావలిసిన నీరంతా నేను తోడిస్తాను," అన్నది రెండో స్త్రీ. ఆమె అయినా అంత పెద్ద బలంగా లేదు. కాని దుర్గమ్మ ఆ మనిషి వెంట బావికి వెళ్ళింది.

"ఇదుగో, చూడు, చేదను బావిలోనే వదిలేసి రావలిసి వచ్చింది. నీకు మాత్రం వస్తుందా?" అంటూ దుర్గమ్మ చేదతాడు పట్టుకుని పైకి లాగదీసింది.

ఇంతలో రెండో స్త్రీ చంకన ఉన్న చంటి పిల్లవాడు దుర్గమ్మ చేతిలో ఉన్న తాడు అందుకుని, గబగబా చేదను పైకి లాగేశాడు. దుర్గమ్మ తన నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుని నిర్ఘాంతపోయింది. ఆమె నోట మాట రాలేదు. కాని పిల్లాడి తల్లి మాత్రం ఏమీ ఆశ్చర్యపడలేదు.

ఆ చంటివాడు ఒక్క రవ్వయినా అలవకుండా చేద తరవాత చేద తోడి పోస్తుంటే ఇద్దరు స్త్రీలూ చక్కగా స్నానాలు చేసి, తమ బట్టలు ఉతుక్కుని, కడవల నిండా నీరు నింపుకున్నారు.

ఇద్దరూ తిరిగి వచ్చేటప్పుడు దారులు చీలే చోట దుర్గమ్మ ఆ రెండో స్త్రీ యొక్క పూర్వోత్తరాలు తెలుసుకున్నది.

"ఈ దారినే పోతే మా ఇల్లు వస్తుంది. మా ఆయన పేరు అపరభీముడు," అని చెప్పి రెండో స్త్రీ తన బిడ్డతో సహా వెళ్ళిపోయింది.

దుర్గమ్మ ఇంటికి వస్తూనే భర్తకు జరిగిన సంగతంతా చెప్పింది.

"ఈ ప్రాంతాల అపరభీముణ్ణని చెప్పుకుంటూ ఇంకొకడు తిరుగుతున్నాడుగా? ఉండు వాడి పని పట్టిస్తా!" అన్నాడు శరభయ్య.

"నీకు పుణ్యం ఉంటుంది. వాడి జోలికి పోకు. వాడు నిన్ను హతమారిస్తే నా పని ఏం కాను? వాడి పసికొడుక్కే అంత బలం ఉంటే వాడి కింకెంత బలం ఉండాలి?" అన్నది దుర్గమ్మ.

శరభయ్య పెళ్ళాం మాట చెవికెక్క నీక, "రేపు పొద్దున్నే వా డింటి దారి చూపించు. పై పని నేను చూసుకుంటాను," అన్నాడు రోషంగా.

మర్నాడు అతను భార్యను వెంటబెట్టు కుని, తన విల్లంబులూ, కత్తి తీసుకుని బయలుదేరాడు. అయితే ఈ అపరభీముడి సంగతి తేల్చుకునే ముందు, బావి సంగతి తెలుసుకుందా మనిపించి మొదట బావి దగ్గిరికే వెళ్ళాడు. సరిగా అదే సమయానికి అపరభీముడి భార్య కూడా అక్కడికి వచ్చింది.

శరభయ్య చేద లాక్కుని బావిలో వేసి, నీటిలో ముంచి, "ఈ ముష్టిచేద లాగటానికి పదిమంది కావాలిట!" అంటూ చేదను తోడబోయాడు. మూలిగి, ముక్కి, పళ్ళు బిగువున చేదను కొద్దిగా నీటి పైకి లాగాడు గాని, మరు క్షణం శరభయ్యను చేద బావి లోకి ఈడ్చింది. సమయానికి చంటివాడు శరభయ్యను పట్టుకోకపోతే శరభయ్య బావిలో పడి ఉండును.





తరవాత ఆ చంటిపిల్లవాడు శరభయ్య చేతి నుంచి చేదతాడు అందుకుని, సునాయాసంగా చేదను పైకి తోడేశాడు.

"ఇప్పటికైనా సంగతి తెలిసిందిగా? ఇక మాట్లాడకుండా ఇంటికి పద!" అన్నది దుర్గమ్మ తన భర్తతో.

"ఇందులో ఏదో గారడీ, కనుకట్టూ ఉన్నాయి. నే నా అపరభీముణ్ణి కలుసుకు తీరాలిసిందే!" అన్నాడు శరభయ్య.

"నీ రాత నేను తప్పించగలనా? నేను మాత్రం నీ వెంట రాను," అంటూ దుర్గమ్మ నీళ్ళు తీసుకుని ఇంటిదారి పట్టింది. రెండో స్త్రీ శరభయ్యతో, "నా మాట విని నువు కూడా ఇంటికి పో. నా మొగుడి కళ్ళ పడటం అంత మంచిది కాదు," అన్నది. కాని శరభయ్య మొండికెత్తి ఆమె వెనకనె వాళ్ళింటి దాకా వెళ్ళాడు.

"నా మొగుడు ఆహారం వేటాడ బోయాడు. తడవ కొక ఏనుగును తినేస్తాడు. అందుచేత నువ్వు ఎక్కడైనా దాక్కుని, చాటు నుంచి ఆయన్ని చూడు. ఎదట పడ్డావో, నిన్ను అవలీలగా విరుచుకు తింటాడు," అన్నది అపరభీముడి భార్య.

ఆమె శరభయ్యను నిలువెత్తు కడవ లోకి దింపింది. అందులో శరభయ్యముని వేళ్ళమీద నిలబడితే గాని బయట జరిగేది కనబడదు.

సాయంకాలం అవుతుండగా పెద్ద సుడి గాలి వీచింది. అపరభీముడు తన ఇంటి ఆవరణలోకి వచ్చి, "ఏనుగును పండావులే?" అని కేకపెట్టాడు. ఆ కేకకు అన్ని వస్తువులూ దద్దరిల్లాయి. శరభయ్య దాగి ఉన్న కడవ కూడా కంపించింది. శరభయ్యకు వణుకు పుట్టుకొచ్చింది. తన కన్న మహాబలుడొక డున్నాడన్నది అతని కిప్పుడు స్పష్టంగా తెలిసిపోయింది.

"నీ ఏనుగు సిద్ధంగా ఉంది. వచ్చి తిను," అని అపరభీముడి భార్య అన్నది.





"కొంచెం ఉండు. ఎక్కడి నుంచో మనిషి వాసన కొడుతున్నది. మనిషిని తిని చాలారోజు లయింది," అంటూ అపర భీముడు తన ఇంటి చుట్టూ ఉండే అడివంతా గాలించటం మొదలుపెట్టాడు.

తన భర్త దూరం వెళ్ళగానే అతని భార్య శరభయ్య దాక్కున్న చోటికి వచ్చి, "నా భర్త వచ్చి తిండితిని, నిద్రపోతాడు. అప్పుడు నేను దీపాన్ని కిటికీలో ఉంచుతాను. నువు పారిపోవటాని కదే గుర్తు. మళ్ళీ ఈ ఇంటి చాయల కెన్నడూ రాకు," అని హెచ్చరించింది.

"రాను తల్లీ, రాను. నాకు బుద్ధి వచ్చింది!" అన్నాడు శరభయ్య.

ఒక రాత్రివేళ శరభయ్యకు కిటికీలో దీపం కనిపించింది. అతను మెల్లగా కడవలో నుంచి బయటికి వచ్చి, వేగంగా నడిచి వెళ్ళిపోసాగాడు.

అతను కొద్ది దూరం వెళ్ళాడో లేదో పెద్ద సుడిగాలి లేచింది. "మనిషి వాసన! మనిషి వాసన!" అన్న మాటలు వినిపించాయి. అపరభీముడి గొంతు శరభయ్య గుర్తించి, కాలి సత్తువ కొద్దీ పరిగెత్తసాగాడు.

శరభయ్య ఎంతసేపు పరిగెత్తినా అపర భీముడు వెంట తరుముతూనే ఉన్నాడు. సుడిగాలి వీస్తూనే ఉంది. శరభయ్య కాళ్ళలో సత్తువ ఉడిగిపోయినా గాలితోపుకు అతను ముందుకు పోతున్నాడు. అతను అరణ్యానికి అడ్డంపడి పరిగెత్తుతూ ఉండటం చేత ఎంతదూరం వెళ్ళినా జనసంచారం తగలటంలేదు.

ఇంతలో శరభయ్యకు ఒక దృశ్యం ఎదుట కనిపించి, పైప్రాణాలు పైనే ఎగిరిపోయినంత పని అయింది. అరణ్య మధ్యంలో ఒక మహాకాయుడు అరణ్య మృగాలను ఒక పెద్ద గుట్టగా పోసి, వాటిని పీక్కుతింటూ ఎముకలను ఒక పక్కకు విసిరివేస్తున్నాడు.

"ఎవరు నువు? ఎవరు నిన్ను తరుము కొస్తున్నారు?" అని మహాకాయుడు శరభయ్యను అడిగాడు.

"ఒక మహాబలుడు!" అన్నాడు శరభయ్య వణికిపోతూ.

మహాకాయుడు కోపంతో హుంకరించి, "అడివి రాక్షసుణ్ణి నేనుండగా మరో మహాబలుడా! రానీ, వాడి ప్రాణాలు తీస్తాను," అని గర్జించాడు.

ఇంతలోనే అపరభీముడు దగ్గిరికి వచ్చాడు. అతనితో వచ్చిన సుడిగాలి శరభయ్యను పైకి ఎగరగొట్టేసింది. దానితో అతను ఎగిరి ఒక చెట్టుకొమ్మల మధ్య చిక్కుకున్నాడు. అక్కడి నుంచి అతను అతి దారుణమైన మహాబలుల యుద్ధం కళ్ళారా చూశాడు.

ఇద్దరు మహాబలులూ కొంచెంసేపు ఒకరి కొకరు ఎదురుగా నిలబడి చూసుకుని, తరవాత కలియబడ్డారు. వాళ్ళు ఒకళ్లనొకళ్ళు తన్నుకున్న తన్నులకూ, గుద్దులకూ కొండలు కూడా పిండి అయిపోవలిసిందే.

తెల్లవారిన దాకా ఇద్దరు మహాబలులూ ఇలాగే యుద్ధం చేసుకున్నాక, కూడబలుక్కున్నట్టు ఇద్దరూ ఆకాశంలోకి ఎగిరి మబ్బుల చాటుకు వెళ్ళిపోయారు. కాని అప్పటికీ వాళ్ళ గర్జనలూ, తన్నులూ శరభయ్యకు వినిపిస్తూనే ఉన్నాయి.

వారిలో ఎవరు గెలుస్తారో చూద్దామని శరభయ్య ఎంతోసేపు చూశాడుగాని వాళ్ళు తిరిగి భూమికి దిగి రానేలేదు. చివరకు అతను చెట్టుదిగి, దారి వెతుక్కుంటూ ఇంటికి చేరుకున్నాడు.

అటు తరవాత శరభయ్య ఎన్నడూ తన బలం గురించి, భార్యతో గాని, ఇతర్లతో గాని గొప్పలు చెప్పుకోలేదు.

ఆ ప్రాంతాలవాళ్లు మబ్బులు ఉరిమినప్పుడల్లా, "మహాబలు లింకా యుద్ధం చేస్తూనే ఉన్నారు," అంటారు.





# ఉత్తర కాండ

లక్ష్మణుడు ఏమీ మాట్లాడలేక, ఏడుస్తూ సీతకు సాష్టాంగ నమస్కారం చేసి, ఆమె చుట్టూ ప్రదక్షిణం చేసి, పడవలో ఎక్కి ఉత్తర తీరానికి చేరుకుని, రథమెక్కి, అనాథురాలి లాగా అవతలి ఒడ్డున ఏడుస్తున్న సీతను మళ్ళీమళ్ళీ వెనక్కి తిరిగి చూస్తూ వెళ్ళిపోయాడు. సీత ఆ రథం కేసే చూస్తూ ఉండిపోయి, పట్టలేక గట్టిగా ఏడవ నారంభించింది. ఆమె ఏడుపుకు నిర్జనమైన అరణ్యం మారుమోగింది.

ఆ నిర్జనారణ్యంలో ఒంటరిగా ఏడుస్తున్న సీతను కొందరు మునికుమారులు చూసి వాల్మీకి వద్దకు పరిగెత్తి వెళ్ళి, "స్వామీ, గంగాతీరాన ఎవరో ఒక స్త్రీ ఏ కారణం వల్లనో ఏడుస్తూ కనబడింది. మనిషి చూడబోతే ఆకాశం నుంచి దిగి వచ్చిన దేవతా స్త్రీ లాగా ఉన్నది. ఆమె కెవరూ ఉన్నట్టు లేరు. మీరు వెంటనే వెళ్ళి ఒకసారి చూడండి," అని చెప్పారు.

వాల్మీకిమహాముని, తన శిష్యులు వెంట రాగా, అర్ఘ్యం తీసుకుని సీత ఉన్న చోటికి వచ్చి, ఆమెను గుర్తించి, "దశరథుడి కోడలికి స్వాగతం. అమ్మా, నీ విక్కడికి ఎలా చేరావో అది నేను నా శక్తి చేత గ్రహించాను. మూడు లోకాల వృత్తాంతాలూ నాకు తెలుస్తూనే ఉంటాయి. నే నుండగా నీ కే భయమూ లేదు. నా ఆశ్రమం దగ్గిరలోనే ఉన్నది. అక్కడ తాపస స్త్రీ లున్నారు. వారు నిన్ను కనిపెట్టి ఉంటారు. దుఃఖించకు. ఈ అర్ఘ్యం





సుమంత్రు డా మాటకు, "లక్ష్మణా, రాముడికి సుఖం అల్పమనీ, అయినవారితో వియోగం కలుగుతుందనీ పూర్వం మునులు చెప్పనే చెప్పారు. ఇది చాలా రహస్యం. నేను నీకు చెబుతాను, కాని నీవు మాత్రం భరత శత్రుఘ్నులకు చెప్పకు," అంటూ ఇలా చెప్పాడు.

ఒకనాడు దశరథుడు వసిష్ఠుడి ఆశ్రమానికి వెళ్ళేసరికి అక్కడ అత్రిమహాముని కుమారుడైన దుర్వాసు డున్నాడు. దశరథుడు మునుల నుంచి స్వాగతసత్కారాలు పొంది, మాటల సందర్భంలో దుర్వాసుణ్ణి, "మహాత్మా, నా సంతతి యొక్క భవిష్యత్తు ఎలా ఉండబోతుంది? మా రాముడి ఆయుర్దాయ మెంత? మిగిలిన నా కొడుకు లెంత కాలం జీవిస్తారు? మా రాముడి కెంతమంది కొడుకు లుంటారు? వా రెంత కాలం జీవిస్తారు?" అని అడిగాడు. ఆ ప్రశ్నలకు సమాధానంగా దుర్వాసుడు ఒక పాత గాథ చెప్పాడు.

దేవాసుర యుద్ధంలో ఓడిపోయి అసురులు భృగుమహాముని భార్యను శరణుజొచ్చారు. ఆమె వారికి అభయం ఇచ్చింది. ఇది చూసి విష్ణువు ఆగ్రహించి, భృగుడి భార్య శిరస్సును తన చక్రాయు

తీసుకో. మా ఆశ్రమంలో నీవు నీ సొంత ఇంట్లో ఉన్నట్టే ఉండవచ్చు," అన్నాడు.

సీత ఆయనకు నమస్కారం చేసి, వాల్మీకి వెంట ఆయన ఆశ్రమం ప్రవేశించింది. వాల్మీకి ఆమెను మునిభార్యలకు అప్పజెప్పి, ఆమెను స్నేహ గౌరవాలతో చూడవలసిందని చెప్పాడు.

అయోధ్యకు తిరిగి పోతున్న లక్ష్మణుడు సుమంత్రుడితో, "సుమంత్రా, అన్నకు సీతా వియోగం వల్ల ఎంతటి దుఃఖం సంప్రాప్తమయిందో చూశావు గదా. నిర్దోషురాలైన సీతకు ఎంత కష్టం వచ్చిందో చూడు," అన్నాడు.



ధంతో ఖండించాడు. వెంటనే భృగుమహా ముని మండిపడి, విష్ణువును భూలోకంలో పుట్టి భార్యావియోగంతో తపించమని శపించాడు. ఆ శాప ప్రభావం చేత విష్ణువు దశరథుడికి కొడుకుగా పుట్టి, రాముడనే పేరుతో ప్రసిద్ధి చెందాడు.

"రాముడు భృగు శాప ఫలం అనుభవించి తీరుతాడు. అతను పదకొండు వేల ఏళ్ళు అయోధ్యను పాలించి, అనేక అశ్వమేధాలు చేసి, బ్రహ్మలోకానికి పోతాడు. అతనికి ఇద్దరు కొడుకులు పుట్టుతారు, అయితే వారు అయోధ్యలో గాక మరొక చోట పుట్టుతారు. వారికి రాముడు పట్టాభిషేకం చేస్తాడు," అని దుర్వాసుడు దశరథుడితో చెప్పాడు.

ఇలా మాట్లాడుకుంటూ, లక్ష్మణ సుమంత్రులు సాయంకాలానికి గోమతి అనే చోటికి వచ్చి ఆ రాత్రి అక్కడ గడిపారు. మర్నాడు ఉదయం వారు తిరిగి ప్రయాణం సాగించి అయోధ్యకు వెళ్ళేటప్పుడు లక్ష్మణుడు, రాముడితో ఏమని చెప్పటమా అని చాలా మథనపడ్డాడు.

రథం అయోధ్య చేరింది. రాముడి ఇంటి ముందు లక్ష్మణుడు రథం దిగి, లోపలికి వెళ్ళి, దీనంగా కన్నీరు కార్చుతూ, సింహాసనం మీద కూర్చుని ఉన్న రాము





డికి సమస్కరించి, "మీ ఆజ్ఞానుసారం సీతను గంగాతీరాన వాల్మీకిమహాముని ఆశ్రమంలో విడిచి వచ్చాను. విచారించవద్దు. వృద్ధి నుంచి క్షయమూ, ఉన్నతి నుంచి పతనమూ, సంయోగం నుంచి వియోగమూ తప్పవు. వచ్చిన అపవాదు దానంతట అదే పోతుంది," అన్నాడు.

"లక్ష్మణా, నా మాట పాటించావు. చాలా సంతోషం. నాకు విచార మేమీ లేదు," అన్నాడు రాముడు. అప్పటి కతను నాలుగు రోజులుగా ప్రజల గొడవలు విచారించలేదు. అది చాలా తప్పు. రాముడా సంగతి లక్ష్మణుడితో అని, అందుకు



తార్కాణంగా నృగమహారాజు కథ యిలా చెప్పాడు.

పూర్వం నృగమహారాజు కోట్ల కొద్దీ అవులను బ్రాహ్మణులకు దానం చేశాడు. ఆయన దాన మిచ్చిన ఆవులలో ఒకటి ప్రమాద వశాన తిరిగి రాజుగారి ఆవుల మందలలో కలిసిపోయింది. అది తెలియక రాజు దాన్ని మరొక బ్రాహ్మణుడికి దాన మిచ్చాడు. మొదట దానం పుచ్చుకున్న బ్రాహ్మణుడు తన ఆవును వెతుక్కుంటూ తిరుగుతూ, కనఖలం అనే చోట రెండో బ్రాహ్మణుడి ఇంట తన ఆవును చూసి గుర్తించి, దానికి తాను పెట్టుకున్న పేరుతో పిలిచాడు. ఆ ఆవు తన పాత యజమాని గొంతు గుర్తించి, కట్టుతాడు తెంచుకుని, అతని వెంట బయలుదేరింది. అది చూసి రెండో బ్రాహ్మణుడు, "నా ఆవును నువ్వు తోలుకుపోతున్నావేమిటి? దీన్ని నాకు నృగమహారాజు దాన మిచ్చాడు," అన్నాడు.

"ఆ నృగమహారాజే దీన్ని నాకూడా దాన మిచ్చాడు," అన్నాడు మొదటి బ్రాహ్మణుడు. ఈ తగాదా వారిద్దరి మధ్యా పరిష్కారం అయేది కాదు గనక వారు తిన్నగా నృగమహారాజు వద్దకే వెళ్ళారు.



అయితే వారికి రాజదర్శనం ఎంతకూ కాలేదు. బయటి ద్వారం వద్ద రోజుల తరబడి పడిగాపులు కాయవలిసి వచ్చింది. చివరకు వాళ్ళు ఆగ్రహించి, ఊసరవెల్లి అయిపోయి ఎవరి కంటా పడకుండా గోతిలో జీవించమని రాజును శపించారు. రాజు బతిమాలగా, యదువంశంలో వాసు దేవుడు పుట్టి శాపవిమోచనం కలిగిస్తాడని చెప్పి ఆ బ్రాహ్మణులు వెళ్ళిపోయారు.

తరవాత నృగమహారాజు వసు ధనే తన కుమారుడికి పట్టాభిషేకం చేసి, తాను ప్రజల కంట పడకుండా ఊసరవెల్లి జీవితం సుఖంగా గడపటానికిగాను కొన్ని గోతులు తవ్వించి, వాటి మీద చెట్ల నీడా, వాటి చూట్టూ పూల మొక్కలూ ఏర్పాటు చేయించుకున్నాడు.

రాముడు లక్ష్మణుడికి నృగమహారాజు కథ చెప్పి, ఆ తరవాత నిమి అనే వాడి కథ కూడా చెప్పాడు.

నిమి ఇక్ష్వాకుమహారాజు కొడుకులలో పన్నెండోవాడు. అతను ఒక దివ్యమైన పురం కట్టించి, దానికి వైజయంత మని పేరు పెట్టాడు. అతను తన తండ్రికి సంతోషం కలిగించటానికై ఒక యజ్ఞం తలపెట్టి, వసిష్ఠుణ్ణి ఋత్విక్కుగా ఉండ మని కోరాడు. అయితే వసిష్ఠుడు తనను







ఇంద్రుడు ముందుగానే యజ్ఞం చేయించమని కోరాడనీ, ఇంద్రుడి యజ్ఞం పూర్తి కాగానే తాను వచ్చి నిమి చేత యజ్ఞం చేయిస్తాననీ చెప్పి వెళ్ళిపోయాడు. అందు చేత నిమి గౌతముణ్ణి పెట్టుకుని యజ్ఞం పూర్తిచేసేశాడు. ఇంద్రుడి యజ్ఞం పూర్తి కాగానే వసిష్ఠుడు తిరిగి వచ్చి, నిమి తన కోసం వేచి ఉండక గౌతముడి చేత యజ్ఞం పూర్తి చేయించుకున్నాడని తెలుసుకుని, కోపం చెంది, రాజును చూడబోయాడు. సరిగా ఆ సమయానికి నిమి నిద్రపోతూ ఉండటం జరిగింది. వసిష్ఠుడు రాజదర్శనం కోసం కొద్దిసేపు చూసి, కావాలనే నిమి తనను వేచి ఉంచాడనుకుని, "రాజా, మరొకరి చేత యజ్ఞం చేయించుకుని నన్నవమానించావు గనక నీ శరీరం నిశ్చేతన మగుగాక," అని శపించాడు.

తరవాత రాజు మేలుకుని వసిష్ఠు డిచ్చిన శాపం తెలుసుకుని, "నిద్రపోయే నన్ను శపించిన నీ శరీరం కూడా చేతనం లేనిదై పోవుగాక," అని ప్రతిశాప మిచ్చాడు.

ఇలా ఒకరినొకరు శపించుకుని నిమి వసిష్ఠులు "విదేహు" లయిపోయారు. అప్పుడు వసిష్ఠుడు తన తండ్రి అయిన బ్రహ్మ వద్దకు వాయురూపం ధరించి వెళ్ళి, "తండ్రీ, నిమి శాపం వల్ల నా దేహం కాస్తా పోయింది. దేహం లేకపోవటం చేత ఎంతో బాధ, ఏ పనీ చెయ్యటానికి లేదు. అందు చేత నన్ను అనుగ్రహించి నాకు మరొక శరీరం కలిగేటట్టు చెయ్యి," అన్నాడు.

బ్రహ్మ వసిష్ఠుణ్ణి మిత్రావరుణుల తేజస్సుతో తిరిగి శరీరాన్ని సంపాదించుకో మన్నాడు. ఆ విధంగా మరొక దేహాన్ని సంపాదించుకున్న వసిష్ఠుడే ఇక్ష్వాకువంశం వారికి పురోహితు డయాడు.

ఇక నిమి సంగతి. నిమి శరీరాన్ని మునులు రక్షించి, దేహం పోయిన నిమి సమస్త ప్రాణుల కళ్ళలోనూ ఉండేటట్టుగా





వరమిచ్చారు. తరవాత వారు నిమి దేహాన్ని మథించగా అందులో నుంచి ఒక పిల్లవాడు పుట్టి మిథి అని పిలవ బడ్డాడు. అతని పేరనే మిథిలానగరం ఏర్పడింది. అతనికి జనకుడని కూడా పేరు.

రాముడు చెప్పిన ఈ కథలు విని లక్ష్మణుడు, "అన్నా, క్షత్రియుడై ఉండి కూడా నిమి వసిష్ఠుడి లాటి మహాత్ముడి పట్ల ఎందుకు శాంతి వహించలేదు ?" అన్నాడు.

"రోషం మూలాన ఎలాటి వాడైనా శాంతిని కోల్పోవటం సహజం. అలా రోషాన్ని నిగ్రహించుకున్న వాడు ఒక్క యయాతి మాత్రమే," అంటూ రాముడు లక్ష్మణుడికి యయాతి వృత్తాంతం ఈ విధంగా చెప్పాడు.

యయాతి నహుషుడి కొడుకు. అతని కిద్దరు భార్యలు. ఒకతె వృషపర్వమహారాజు కుమార్తె అయిన శర్మిష్ఠ, రెండవది శుక్రాచార్యుడి కుమార్తె అయిన దేవయాని. కాని యయాతికి శర్మిష్ఠ పైన ఉండే ప్రేమ దేవయాని పైన ఉండేది కాదు. అదేవిధంగా అతనికి శర్మిష్ఠ కొడుకైన పూరుడి పైన ఉన్నంత మమకారం దేవయాని కొడుకైన యదుడి పైన ఉండేది కాదు. నిజానికి పూరుడు మంచి గుణవంతుడు, ఆ పైన శర్మిష్ఠ కొడుకు కూడానూ. తన తండ్రి పూరుడి పైన హెచ్చు ప్రేమ చూపటం సహించలేక యదుడు తన తల్లి అయిన దేవయానితో, "అమ్మా, శుక్రాచార్యు డంతటి వాడి కూతురువై ఉండి నువ్వూ, నీ కొడుకైన నేనూ ఇంత అవమానాన్ని ఎందుకు సహించాలి? మన మిద్దరమూ అగ్నిలో దూకి ప్రాణత్యాగం చేద్దాం. ఈ అవమానాన్ని ఒక వేళ నువ్వు సహించినా, నేను సహించలేను. ఆత్మహత్య చేసుకుంటాను, నాకు అనుజ్ఞ ఇయ్యి," అని పెద్ద పెట్టున ఏడ్చాడు.

కొడుకు దుఃఖం చూసి దేవయానికి రోషం వచ్చింది. ఆమె తన తండ్రిని తలుచుకున్నది, వెంటనే శుక్రాచార్యుడు వచ్చాడు.

"నా భర్త నన్ను చాలా లోకువగా చూస్తున్నాడు. ఆ అవమానం భరించటం కష్టంగా ఉంది. నేను అగ్నిలో దూకో, విషం తినో, నీటిలో పడో ఆత్మహత్య చేసుకుందా మనుకుంటున్నాను," అన్నది దేవయాని తండ్రితో.

శుక్రాచార్యుడికి పట్టరాని ఆగ్రహం వచ్చి, యయాతిని ముసలితనంతో జీవించమని శపించి, కూతురి నోదార్చి, ఇంటికి తిరిగి పోయాడు. శుక్రాచార్యుడి శాపాన్ని యయాతి ఎంతో సహనంతో స్వీకరించాడు.

అతను యదువును పిలిచి, "నాయనా, నే నింకా భోగాలతో తృప్తి పడలేదు. అందుచేత నా ముసలితనాన్ని నువు కొంత కాలం భరిస్తావా? నాకు భోగాలతో తృప్తి కలిగాక నీ యౌవనం నీ కిచ్చి ముసలితనం తీసుకుంటాను," అన్నాడు.

"నీ సరసన భోజనం చెయ్యటానికి అర్హుడైన పూరు డుండగా నీ ముసలితనాన్ని నే నెందుకు తీసుకోవాలి? వాణ్ణే తీసుకోమను," అన్నాడు యదువు.

అప్పుడు యయాతి పూరుణ్ణి పిలిచి యదువు నడిగినట్టే అడిగాడు. తన తండ్రి వార్థక్యాన్ని స్వీకరించటానికి పూరుడు మనస్ఫూర్తిగా అంగీకరించాడు. యయాతి తన ముసలితనాన్ని పూరుడి కిచ్చి, వాడి యౌవనం తాను పొంది, అనేకవేల యజ్ఞాలు చేశాడు, అనేకవేల సంవత్సరాలు రాజ్యం చేశాడు. చివర కతను తన కొడుకు నుంచి ముసలితనం తీసుకుని, వాడికే రాజ్యాభిషేకం చేసి, దేవయాని కొడుకైన యదువుకు రాజ్యార్హత లేకుండా చేశాడు.

యయాతి అనంతరం పూరుడు ప్రతిష్ఠానపురం రాజధానిగా పెట్టుకుని చాలా కాలం రాజ్యం చేశాడు.

రామలక్ష్మణు లిలా కథలు చెప్పుకుంటూండగానే రాత్రి గడిచిపోయింది. తూర్పున అరుణరేఖలు కనిపించాయి.





# విధినిర్ణయం

పూర్వం సౌవీరదేశాన్ని ధాత అనే రాజు పాలించేవాడు. ఆయన భార్య పేరు ధాత్రి. వారి ఏకైక సంతానమైన సుశీల అసాధారణ సౌందర్యవతి. ఆమె చక్కగా చదువుకుని, యుక్తవయస్కురా లయాక, ఆమె తల్లిదండ్రులు ఆమె వివాహం గురించి ఆలోచనలు ప్రారంభించారు. అయితే ఈ విషయంలో ఇద్దరికీ ఏకాభిప్రాయం ఏర్పడ లేదు. సుశీలను తన మేనల్లుడి కివ్వాలని రాజు ఉద్దేశం; ఆమెను తన మేనల్లుడి కిచ్చి చేస్తే బాగుంటుందని రాణి అభిప్రాయం.

అయినప్పటికీ ఆ భార్యాభర్తలు తమ కుమార్తె విషయం వాదులాడుకో లేదు. కాని తమ అభిప్రాయం ప్రకారమే సుశీల వివాహం జరగాలని సంకల్పించుకున్నారు. అందుకు తగిన ఏర్పాట్లు ఒకరికి తెలియకుండా ఒకరు కొనసాగించారు కూడా.

రాజు తన మేనల్లుడికి కబురుచేసి ఒక విడిదిలో ఉంచి, అకస్మాత్తుగా సుశీల పెళ్ళి ముహూర్తం ప్రకటించాడు. అయితే రాజు ఇలాటి ఎత్తు వేస్తాడని ముందుగానే ఊహించిన రాణి తన మేనల్లుణ్ణి కూడా రహస్యంగా పిలిపించి, అంతఃపురంలోనే ఒక గదిలో దాచి ఉంచింది.

ఈ సమయంలో బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఆకాశ మార్గాన సౌవీరరాజధాని మీదుగా వెళ్ళటం తటస్థించింది. సర్వజ్ఞులైన ఆ త్రిమూర్తులు, సౌవీర రాజూ, అతని భార్యా కుమార్తె వివాహ విషయమై ఆడే నాటకాన్ని చూసి ఆశ్చర్యపడ్డారు.

విష్ణువూ, శివుడూ బ్రహ్మను, "ఇంతకూ సుశీల ఈ ఇద్దరు పెళ్ళికొడుకులలో ఎవరికి భార్య కావాలని నిర్ణయించావు?" అని అడిగారు. ఎందుకంటే, స్త్రీ పురుషులకు ముడులుపెట్టే పని బ్రహ్మది.



"ఆ ఇద్దరికీ సుశీల భార్య కాదు," అన్నాడు బ్రహ్మ.

విష్ణు మహేశ్వరులు ఆశ్చర్యపడి, "మరెవరికి భార్య అవుతుంది?" అని బ్రహ్మను అడిగారు.

బ్రహ్మదేవుడు చిరునవ్వు నవ్వి వేలితో చూపుతూ, "ఆ వీధిలో బిచ్చమెత్తుకుంటున్న ఆ కుంటివాడే సుశీలకు భర్త అవుతాడు," అన్నాడు.

విష్ణువూ, శివుడూ మరింత ఆశ్చర్యపోయారు. శివుడు విష్ణువు కేసి చూసి, "ఇది ఎలా సాధ్య మవుతుంది? దీనికి తిరుగు లేదా?" అన్నాడు.



"జరిగినా జరగవచ్చు. బ్రహ్మ ఎంత అసాధ్యాలను కూడా సాధ్యం చెయ్య గలడు," అన్నాడు విష్ణువు.

"నా నిర్ణయాన్ని ఎవరూ తప్పించలేరు," అన్నాడు బ్రహ్మ.

శివుడికి బ్రహ్మ నిర్ణయాన్ని అబద్ధం చెయ్యాలని బుద్ధిపుట్టింది. ఆయన విష్ణువుతో చేరి చిన్న కుట్ర చేశాడు.

"నువు గరుత్మంతుడి సహాయంతో ఈ కుంటి బిచ్చగాణ్ణి సప్తసముద్రాల అవతల చేర్చు. బ్రహ్మ నిర్ణయం ఎలా జరుగుతుందో చూతాం!" అన్నాడు శివుడు. విష్ణువు సరేనని గరుత్మంతుణ్ణి స్మరించి, కుంటి బిచ్చగాణ్ణి సప్తసముద్రాల అవతల ఎక్కడైనా దింపమన్నాడు. గరుత్మంతుడు అలాగే చేశాడు.

ఇక్కడ సౌవీరనగరంలో సుశీల పెళ్ళి ముహూర్తం దగ్గరపడుతోంది. అందుచేత రాణి తన కుమార్తెను మాయం చెయ్య సంకల్పించి, పాకశాలలో వరసగా పెట్టి ఉన్న ఫలహారాల తట్టలలో ఒక దానిలో సుశీలను కూర్చోబెట్టి, ఆమె చేతికి పర మాల ఇచ్చి, "అమ్మా, ఈ తట్ట మీది మూత ఎవరు తెరుస్తారో వారి మెడలో ఈ మాల వేసెయ్యి," అన్నది.



సుశీల తన జీవితంలో ఎన్నడూ తల్లి మాట జవదాటి ఎరగదు. అందుచేత తల్లి చెప్పినట్టు చెయ్యటానికి తీర్మానించుకున్నది. ఆ తట్టను తన మేనల్లుడి దగ్గిరికి ముహూర్తం వేళకు పంపుదామని రాణి నిశ్చయించింది.

ఈ లోపల సప్తసముద్రాల అవతలికి చేరుకున్న కుంటివాడు, ఆ నిర్జన ప్రదేశంలో తిండికి మాడసాగాడు. వాడు ఏ పాపమూ ఎరగడు; నలుగురూ పెట్టే తిండితో పొట్ట నించుకుని, రామా కృష్ణా అనుకుంటూ కాలక్షేపం చేసేవాడు. అందుచేత వాడు, "భగవంతుడా, నాకీ ఆకలిబాధ ఎందుకు తెచ్చిపెట్టావు? నేను నీ కేమి అపచారం చేశాను?" అని ఆక్రోశించాడు.

వాడి మొర విని విష్ణువు, తన మూలానే వాడికీ కష్టం సంభవించింది గనక, గరుత్మంతుణ్ణి పిలిచి, "సప్తసముద్రాల అవతల నువు దించిన బిచ్చగాడు తిండికి మాడుతున్నాడు. వాడి దగ్గిర ఒక తట్టెడు ఆహారం కూడా పెట్టిరా," అన్నాడు.

గరుత్మంతుడు ఆహారం కోసం వెతుకుతూండగా సౌవీరరాజుగారి పాకశాలలో ఆహారపు తట్టలు వరసగా కనిపించాయి. అతను శరవేగంతో వచ్చి, ఒక చివరగా ఉన్న తట్టను తన్నుకుని, రివ్వున ఎగిరి



పోయి, సప్తసముద్రాల అవతల బిచ్చగాడున్న చోట ఆ తట్టను దించి, తన మానాన తాను వెళ్ళిపోయాడు.

అయితే విధివశాన, గరుత్మంతుడు తన్నుకుపోయిన తట్ట సుశీల దాగి ఉన్నది.

భగవంతుడు తనపై అనుగ్రహించి ఆహారం పంపాడనుకుని కుంటివాడు తట్ట మీది మూత తెరిచేసరికి, తట్టలో నుంచి సుశీల లేచి నిలబడి, తన చేతిలో ఉన్న పరమాలను తల్లి ఆజ్ఞ ప్రకారం ఆ కుంటి బిచ్చగాడి మెడలో వేసేసింది. మరుక్షణం ఇద్దరూ ఒకరినొకరు చూసుకుని నిర్ఘాంతపోయారు. అంతటి సౌందర్యవతి అయిన రాజకుమార్తె తనను భర్తగా వరించినందుకు కుంటివాడు పరమానందం చెందాడు. ఆ కుంటివాణ్ణే విధి తనకు భర్తగా నిర్ణయించాడు కాబోలు ననుకుని వాడికి తట్టలో ఉన్న భక్ష్యాలను సుశీల ఇచ్చి, వాడి ఆకలి తీర్చింది.

ముహూర్తం వేళకు రాణి తన కూతురున్న తట్ట కోసం వెతికింది, కాని అది కనిపించ లేదు. తన ఎత్తు తన భర్తకు తెలిసిందని ఆమె అనుకున్నది. కాని రాజు కూడా తన కుమార్తె కోసం వెతకటం చూసే సరికి పెద్ద గందరగోళం బయలుదేరింది. అది చూసి ఇద్దరు పెళ్ళికొడుకులూ చల్లగా జారుకున్నారు.

బ్రహ్మ నిర్ణయం అమలు జరిగిన పద్ధతి చూసి శివుడు ఆశ్చర్యపోయాడు. "నేను ముందే చెప్పలెదా ?" అన్నాడు విష్ణువు.

తరవాత త్రిమూర్తులు నూతన వధూవరుల వద్దకు వెళ్ళి, వారిని దీవించి, కుంటివాడికి శరీరవైకల్యం పోయేటట్టు చేసి, ఆ దంపతులను సౌవీరదేశం చేర్చారు. త్రిమూర్తులే తమకు ప్రసాదించిన అల్లుణ్ణి చూసి రాజూ, రాణీ పరమానందభరితులయారు. సుశీల తన భర్తతో చాలా కాలం సుఖంగా జీవించింది.



# 53. కప్పడోసియా గోపురం

కప్పడోసియా రాష్ట్రం (టర్కీ)లో ఇలాటి సహజ గోపురాలు చిన్నవి, పెద్దవి కలిపి 50,000 ఉన్నాయి. ఇది 5 "అంతస్తుల" గోపురం. 1500 ఏళ్ళ కితం క్రైస్తవమునులు ఈ గోపురాలలో చేరి, తమ అవసరాలకు తగినట్టుగా గుహలను మలుచుకుని, ప్రపంచానికి దూరంగా నివసించేవారు.



Photo by Naren V. Mithani



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఒకే మాట అంటాం

పంపినవారు:
పి. ఎ. రావు, విజయనగరం

Photo by K. N. Malli



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఒకే చోట ఉంటాం

పంపినవారు:
పి. ఎ. రావు, విజయనగరం

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1966 జూన్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఒకే మాట అంటాం

రెండవ ఫోటో : ఒకే చోట ఉంటాం

పంపినవారు : పి. అన్నపూర్ణారావు,

విజయనగరం - 1

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



అహా ... కోలినాస్

శ్వాసలో తియ్యని సువాసన కొరకు!



అహా ... కోలినాస్

చల్లని, తియ్యని రుచి కొరకు!



అహా ... కోలినాస్

సమృద్ధియైన నురగ కొరకు!



అహా ... కోలినాస్

స్వచ్ఛత లేక తాజాదనం కొరకు!

ఆ ఐదో ఆమెకు ఒక్క కిటుకు: కోలనోస్ వాడి ఒక్క చిరునవ్వు, అందరిలాగే! ప్రతి రోజూ రాత్రి మరియు ఉదయము కోలినోస్ డెంటల్ క్రీమ్‌తో పళ్లను బ్రష్ చెయ్యాలి. ఈ సహవాసంలో అధిక విశ్వాసము, అధిక ఉల్లాసము!



స్వచ్ఛమైన పళ్లు! తాజా శ్వాస!



అహా ... కోలినాస్




Registered user: GEOFFREY MANNERS AND COMPANY LIMITED

ASP/GM/K-11

